


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి.
# అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర.
# వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—విశ్వసించండి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ-

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్

SAA/AMS/2197 TEL

కట్నం పురుషలక్షణంకాదు. నమ్ముకున్న తోడుకు జీవితాంతం నీడయివ్వడమే మగవాడి లక్ష్యం!



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అత్తవారిల్లు





నిర్మాత: ఏ.వి.సుబ్బారావు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కె.ప్రత్యగాత్మ

సంగీతం: టి.చలపతిరావు

నవయుగ



NVKR



# ఉత్తరాలు

## క్రికెట్, సా. స.

ఈ వారం [28.1.77] పత్రికలో సామాన్యుని సణుగుడు చదివిన తర్వాత యిది వ్రాయాలనిపించింది. ఈ రోజుకు 3 వ టెస్టు కూడా ఇంగ్లాండు గెలవటంతో మనవాళ్ల పెర్‌ఫార్మన్స్ ఎంత పూర్‌గా వుందో అర్థమవుతున్నది. బొత్తిగా ప్రాక్టీస్ లేకుండా దైవాధీనం సర్వీస్‌గా మనవాండ్రు ఆడుతున్నారు. వీరాజీగారు వ్రాసినట్లు పక్కన పాకిస్తాన్ ఎలా ఆడుతున్నదో చూసైనా మన వాండ్లు సిగ్గుపడటం లేదు. అదెంత చిన్న దేశం? ఇంత దేశం మొత్తం మీద మంచి క్రికెట్ ఆటగాళ్లే లేరంటే అందరూ నవ్వుతారు. ప్రపంచంలోనే మన ప్రిస్టేజి పోతుందని క్రికెట్ బోర్డు అనుకుంటున్నట్లు లేదు.

అన్నిరంగాల్లోలాగా క్రికెట్‌లో కూడా పాలిటిక్స్ ఫేవరిటిజమ్ చూపించి మంచి ఆటగాళ్లకులవకాశమివ్వకుండాదేశపరువే పోగొడుతున్నారు. ఇండియాతో టెస్టు ఓడిపోని మళ్లీ హేళనచేస్తే, మళ్లీ కొంచెం కృషి చేసి ఆట ప్రాక్టీస్ చేసి, ఒకసారి గెలుస్తారు. గెల్చాంగదా అని ధీమాగా మళ్లీ మామూలుపాటే. క్రికెట్ కి ఎంతో సాధన అవసరము. మన టీముకి అది వున్నట్లు కన్పడదు. రెండువికెట్‌లుపడగానే ధైర్యంగా నుంచోలేక పోతున్నారు. ప్రపంచంలో ఖ్యాతి సంపాదించాలని చిన్న దేశములైనా కృషిచేస్తాయి కానీ మనకు దురదృష్టము. స్వతంత్రమువచ్చిన తర్వాత పట్టుదల, ఖ్యాతి అనే మాటలకే అర్థము తెలియుటలేదు. ఒకరకమయిన లేజీనెస్ అందర్నీ ఆవహించింది. పార్టీలు, తాగటము, తినటములక్కటే ఎక్కువ యినట్లు వున్నది. దేశంమొత్తమే నిర్వీర్యమై పోతున్నది. స్కిల్, టాలెంట్ వున్న వాళ్లు ముందుకు తేబడటము, సమర్థతకు విలువివ్వటము మృగ్యమై పోయినది.

కె. శాంత, సంగారెడ్డి [మెదక్]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం · 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
|1938-1972|
శుక్రవారం · 11-2-'77
నలనామ సం. మాఘ బ. అష్టమి
సంపుటము 70 . సంచిక 24
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక





# 'రావ'నుకున్న ఎన్నికలు 'వచ్చే'శాయి.



''హ్యాట్రిక్''

శ్రీమతి ఇందిరా గాంధీ ప్రధాన మంత్రిగా కొనసాగుతూ వుండి జనవరి 19 నాటికి పదకొండు సంవత్సరాలు పూర్తి అయ్యాయి... "నాకు ప్రజల మీద ప్రజాస్వామ్యంమీద అచంచలవిశ్వాసంవున్నది.. యిదుగో మార్చి మూడో వారంలో లోక్‌సభకు ఎన్నికల ప్రకటిస్తున్నాను" అంటూ ఆమె రేడియోలో చేసిన ప్రకటన; "ఇప్పట్లో ఇటువంటివేమీరావు" అని

జైల్లో కూర్చుని విచారిస్తున్న ప్రతిపక్ష నాయకులను టక్కున విడుదలచేసి మరీ చకితులను చేసింది...

వెంటనే లోక్ సభను [శ్రీమతిగాంధీ సిఫార్సుతో] రాష్ట్రపతి రద్దు చేసేశారు.

మొరార్జీ,అద్వానీలు జైలు వెలుపలి భారతదేశపు గాలులు పీల్చుకుని జైప్రకాష్, సంజీవరెడ్డిలాంటి కమ్యూనిస్టేతర ప్రతిపక్ష నాయకుల కోసం పరుగులు తీశారు. 'జనతాపార్టీ'గా ఏకోన్ముఖం కావాలన్న వీరి ''కేక'' దేశమంతటా మోగింది.

## ఈసారి ఎంత శాతం?

లోక్‌సభకు మొత్తంమీద అన్ని రాష్ట్రాలలోను కలిపి 542 స్థానాలున్నాయి.

మార్చి మూడోవారంలో ప్రతిపక్షాలు ఆరోపిస్తున్న ''అవ్యవధి ఎన్నికల''లో యీ స్థానాలకు 22 రాష్ట్రాలలోను, 9 కేంద్ర పాలిత ప్రాంతాలలోను ఒకేసారి సుమారు మూడులక్షల పాతికవేల పోలింగు కేంద్రాలలో బారులుతీరి నిలబడి వోట్లు వేసే అవకాశం యీ దేశంలో వమోదైన వయోజనులైన 32 కోట్ల మందికి లభించింది.

ఇప్పుడు పత్రికలమీద సెన్సారు నిబంధనలను అములుచేయడంమానేశారు అయితే ఫిబ్రవరి 11, 1976 నుంచి దేశంలో ''చట్టం''గా అమలులోకొచ్చిన ''అభ్యంతరకర వార్తల ప్రచురణ నిరోధక శాసనం'' మాత్రం అలాగే వుంది!

ఎన్నికలు పెట్టడానికి అవసరమైన రాజ్యాంగ 'ఖచిత'మైన గడువు 35 రోజులకన్నా ఒక్క ఐదురోజులు మాత్రం ఎక్కువ నోటీసుతో; అంతా ఎన్నికలకు సిద్ధంకావాలనటం ముప్ఫయి సంవత్సరాల ప్రజాస్వామ్య పాలనానుభవం గల దేశానికి ''అవ్యవధి ఎన్నిక'' ఎందుకు కావాలి? అనేవాళ్లూ వున్నారు – కమ్యూనిస్టులకు తప్ప తదితరులందరికీ ''కాలూ చెయ్యీ కూడదీసుకునే అవకాశం'' యివ్వలేదనీ; విమర్శిస్తున్న ప్రతిపక్షాల వాళ్ళూ వున్నారు –

కాకపోతే యీసారి పరిశీలకులు ప్రపంచంలోని అన్ని మూలలనుంచీ చూస్తున్నదీ...ఒక్కటి వుంది''ఈసారి వోటర్ల సంఖ్య లోగడకన్నా నాలుగు కోట్లు ఎదిగింది...మామూలు జనాభాకి అనుభవం ఆలోచన పెరిగింది...

కనుక ఎంత శాతం మంది వోటింగులో పాల్గొంటారు? అన్న కుతూహలం మాత్రం సహజం...

లోగడ ఎప్పుడూ 60 శాతం మించి మన భారతీయులు ఎన్నికలలో పాల్గొనలేదు. ఈసారి ఇది ఎంత శాతం?!...

ఏది ఏమైనా మార్చి 25న కాని 29 లోగా ఏ ఒక్కరోజునైనా గానికొత్త లోకసభ సమావేశం అయి తీరుతుంది. ఈలోగా విద్యార్థులకు పరీక్షలు సహా యింకా ఎన్నో యితర కార్యక్రమాలు తాత్కాలికంగా సెలవు పుచ్చుకుంటాయనుకోడంలో తప్పులేదు...

[— సామాన్యుడు]

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

ముత్యాల ముగ్గులను తన నుదుట అలకరించుకుని... రంగుల హరివిల్లులా ముస్తాబై, మా చేతికందిన సంక్రాంతి సంచిక చదివాము. ఆగాచార్య కలం ముఖ పత్రంపై నాట్యం చేసిందా? అన్నంత బాగావుంది ముఖచిత్రం.

ఇక పోతే కథల్లో సత్యం మందపాటిగారి 'సృష్టి' కథ ప్రయోజనాత్మకంగా వుంది. ఈ కథ చదివిన వారు సినిమా వ్యవస్థను గురించి ఎంతైనా తెల్సుకోవచ్చు. 'తెనుగు వారెక్కడ' కృష్ణప్రియ గారి కథానిక ఓ మాదిరి వుంది. 'తెలంగాణాలో సోమరితనం' అనటం మాకు కొంత విచారాన్ని కలుగజేసింది. సోమరితనానికి తెలంగాణా యేమిటి? ఆంధ్రా యేమిటి? వి. వి. రమణారావుగారి 'పద్మావతీవిలాస్' కథ కూడ ఉత్సాహంగా వుంది.

యశోద, పద్మాకర్ [నాగులపల్లి]

### కథలు

14.1.1977 వ సంక్రాంతి పత్రికలో ''పట్నం బస్సు'' కథ ఇతివృత్తము చాలా బాగుంది. కాని కథలోని మోచోడి కొడుకు బి. ఏ. చదివికూడా తల్లి, తండ్రులతో మాట్లాడే అప్పుడు గ్రామ్య భాషలో మాట్లాడటము చాలా ఎబ్బెట్టుగావున్నది.

అరుణగిరి యాదగిరి, [కుమార్‌పల్లి]

( 49వ పేజీ చూడండి)

**సూర్యుడు** కొండల వెనక నుండి పైకొచ్చాడు దాచిపెట్టి ఉన్న నిధిని చూసుకోవడానికి వచ్చేవాడిలాగ సూర్యుడు ఆతురతతో ఆకాశాన ఎగబ్రాకుతున్నాడు.

"నా కష్టం తిని నా నోట్లో దుమ్ము కొట్టేవోనికి మంచి సావురాదు. వొచ్చే జన్మలో నా యింట్లో కన్నెర్రెద్దయి పుట్టాడు. నా యింటెనక దిబ్బపురుగై పుట్టాడు."

సూర్యుడు రెండు బారలు పైకెగబ్రాకాడు. సూర్యకిరణాలలో తీవ్రత రాజుకుంటున్నది.

రామచంద్రుడు ఒక గోతిని త్రవ్వడం పూర్తిచేసి, దానికి దాపున నాలుగు బారల దూరాన మరొక గోతిని త్రవ్వడం ప్రారంభించాడు.

కిష్టుడు చద్ది తినడం ముగించి తుండు గుడ్డతో మూతి తుడుచుకుంటూ బయట కొచ్చాడు. వాడు పందుల 'గూడు' వైపు నడిచి ద్వారం తెరిచాడు. పందులు కీచు కీచు మంటూ, సన్నటి తోకలను తిప్పుకుంటూ, ఒకదాని డొక్కలో మరొకటి కుమ్ముతూ బయట కొచ్చాయి. అవి కడుపులను ఊపుకుంటూ, నేలను ముట్టెలతో మూచూస్తూ వెంపలిచెట్లగుండా గుంపుగా నడవసాగాయి. కిష్టుడు అరుగుమీదున్న పాటల పుస్తకాన్ని ఇంటి చూరులోఉన్న పొడుగాటి వెదురు బెత్తాన్ని తీసుకుని పందుల వెంట నడవసాగాడు. వాడు గొంతు సవరించుకుని, "పోయి వచ్చేదనయ్యా - మైనాకుడా! సీతమ్మ జాడను చూసి వచ్చేదను -" అని పాడుతూ బొంతజెముడు పొదల వెంట మలుపు తిరిగి అదృశ్యుడైపోయాడు.

రామచంద్రుని దేహం చెమటలు క్రక్కడం ప్రారంభించింది. ఇంటిముందు కలాపి నీళ్ల తేమ ఆరిపోయింది. తేమ ఆరిపోవడంతో ముగ్గు స్పష్టంగా, అందంగా ఎండలో మెరుస్తున్నది.

మద్దిమాను కొమ్మలనుండి వ్రేలాడుతూ నిద్రిస్తుండిన కబోది పిట్టలు టప టప రెక్కలు కొట్టుకుంటూ లేచాయి. చప్పుడు విని రామచంద్రుడు తల త్రిప్పి చూశాడు. సూర్యుడు మద్దిమాను కొమ్మల గుండా ప్రకాశిస్తున్నాడు. అతడు అరచేతిని కిరణాలకడ్డంగా పెట్టుకుని చూశాడు. పిట్టలు గాలిలో కకావికలుగా ఎగురుతున్నాయి.

సీరియల్

# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

డాక్టర్ కేశవరెడ్డి

*(గత సంచిక తరువాయి)*

జీపు ఒకటి బొంతజెముడు పొదల వద్ద మలుపు తిరిగి వస్తూ కనిపించింది. అది వెంపలి చెట్లను నలగదొక్కుకుంటూ రామచంద్రుని ఇంటివైపు వస్తున్నది. పిల్లలు కేకలేసుకుంటూ దాని వెంబడి పరిగెత్తి వస్తున్నారు. జీపు మెల్లగా వచ్చి మద్దిమాను కింద ఆగింది దానిలోనుండి ముందు డ్రైవరు, తరువాత ముగ్గురు వ్యక్తులు దిగారు డ్రైవరు మద్దిచెట్టు వెనకకు వెళ్లి దాని చాటున కూర్చుని బీడీ ముట్టించుకుని పీల్చసాగాడు.

ఎండ తీక్షణంగా కాస్తున్నది.

జీపులో నుండి దిగిన ముగ్గురు వ్యక్తులు మద్దిచెట్టుయొక్క నీడను వదలడానికి భయపడుతున్నట్లు అక్కడే నిలుచున్నారు. ఆ ముగ్గురిలో ఒకడు విశాలమైన బొజ్జ, బరువైన చంపలు కలిగి వున్నాడు. అతడు తెల్లటి పాంటును, తెల్లటి షర్టును ధరించి బూడిద రంగు టోపీని పెట్టుకుని ఉన్నాడు. నోటిలో నల్లని పైపు పెట్టుకుని కాలుస్తున్నాడు. రెండవ వ్యక్తి గాలి జోరుగా వీస్తే కొట్టుకుపోగలంత సన్నగా ఉన్నాడు. అతడు తెల్లటి షర్టును నల్లటి పాంటులో జొనుపుకుని ఉన్నాడు. మూడవ వ్యక్తి బిళ్ల బంట్రోతు ఒక పెద్ద ఫైలును చేతబట్టుకుని నాలుగడుగులు ముందుకొచ్చి, ఎలుగెత్తి "రంపాలోళ్ల రామచంద్రుడంటే ఎవరయ్యా?" అనడిగాడు.

రామచంద్రుడు చేతిలోని గునపాన్ని ఎర్రని మట్టిమీద జారవిడిచి "నేనేసామీ" అని పదడుగులువేసి ఆ ముగ్గురి చెంతకు వచ్చాడు.

చెంతకు వచ్చిన రామచంద్రుడిని బిళ్ళజవాను ఎగాదిగా చూడసాగాడు. మిగిలిన



ఇద్దరు అతనివైపు క్షణకాలం చూసి, తరువాత తమ చూపులను ఇంటి మీదకు మరల్చారు.

సన్నటి మనిషి "ఇల్లు ఖాళీచెయ్యమని పదిరోజుల క్రితమే నోటీసు పంపితిమి గదయ్యా ఇల్లు ఖాళీచేసేదానికింకా నీకు తీరిక దొరకలా ?" అనడిగాడు.

"మీ కాళ్ళకు మొక్కుతాసామి. ఇల్లు కాళీజేసి నానెడబోదు నాపేరున పట్టా అయిన తావున్నే ఇల్లు కట్టుకున్నాసామి." అన్నాడు రామచంద్రుడు.

జీపు ననుసరించి వచ్చిన పిల్లలు "గవుర్మెంటోళ్ళ" కురామచంద్రునికీ మధ్య జరుగుతున్న సంభాషణలను వింటూ నిలుచున్నారు. ఆ మాటలు వాళ్ళకు అర్థం కాకపోవటం వల్లనైతేనేమి,సూర్యుని కిరణాలు వాడిగా సోకుతూ ఉండడం వల్లనైతేనేమి వాళ్ళు ముఖాలను, కళ్ళను చిట్లించుకుని చూడసాగారు. పిల్లవాళ్ళనే గాక హరిజన వాడలోని చాలమంది జనాన్ని జీపు తనవెంట ఈడ్చుకొచ్చింది. వారందరూ రామచంద్రుని ఇంటిముందు అర్ధవలయాకారంగా నిలుచుని చూడసాగారు.

సన్నటిమనిషి తన నడుముకు ఉన్న పటకాను తడుముకుంటూ "ఎవరయ్యా నీకు చెప్పింది ఈ జాగా నీ పేరున పట్టా అయిందని ? ఇక్కడొచ్చి ఇల్లు కట్టుకోగానే ఈ జాగా నీదైపోతుందా ? తాగినోడు

# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

*జరిగినకథ :3* రామచంద్రుడు. చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లు కట్టుకోవటానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టుకెళ్ళి దొంగ సాక్ష్యం చెప్తాడు రామచంద్రుడు. పెదరెడ్డి రిపోర్టు చేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు. పెదరెడ్డిని వేడుకోటానికి వచ్చిన రామచంద్రుడిని తోటి హరిజనులే హింసిస్తారు.

మాట్లాడినట్లు మాట్లాడుతున్నావు గదయ్యా." అన్నాడు.

నడుం వంచుకుని ఉన్న రామచంద్రుడు కుడిచేతిని ఎడమభుజం మీదనూ, ఎడమచేతిని కుడిభుజం మీదనూ ఉంచుకుని వినయంగా, "లేదుసామీ. ఈనేల నాపేరుమీద పట్టా అయినాకనే ఈడఇల్లుగట్టుకున్నాను సామి." అన్నాడు.

"ఎవరయ్యా నీకు పట్టాజేసిచ్చింది? ఏదీ ఆ పత్రాలూ అవీ ఇలాతే. తెచ్చి చూపించు." అన్నాడు సన్నటి మనిషి.

రామచంద్రుడు తన చేతులను అలాగే ఉంచుకుని, నడుమును అలాగే వంచుకుని, "నాకు అచ్చిరమ్ముక్క తెలవదు సామి. పత్రాలూ అవీనాదగ్గిర లేవుసామి. నాకెవురూ ఈలేదు. నాకీనేల పట్టా జేసిచ్చింది మాత్రం మా పెదరెడ్డి సామి." అన్నాడు.

"గవుర్మెంటోళ్ళిద్దరూ" ఇంచుకసేపు ఆంగ్లంలో మాట్లాడుకున్నారు. తరువాత సన్నటి మనిషి, "మీ పెదరెడ్డంటే ఎవరయ్యా. తడకం సుబ్బారెడ్డేనా?" అనడిగాడు.

రామచంద్రుడు."ఆయనే సామి. ఆయనే నన్ను రిజిస్ట్రాఫీసుకు తీసుకుపోయి ఏవో కాయితాలమీద ఏలిముద్రలేయించుకుని, ఇంగటాల్నుంచి ఆతావు నీదేపోరా అన్జెప్పినాడు సామి. నాచేతికి కాయితాలు ఏవీ ఇయ్యలేదు సామి " అన్నాడు.

"గవుర్మెంటోళ్ళిద్దరూ"మళ్ళీ ఆంగ్లంలో మాట్లాడుకోసాగారు.

సూర్యుడు పైకి చకచకా ఎగబాకుతున్నాడు. ఎరెత్తినట్లు ఆకాశంలో తిరుగుతుండిన పిట్టలు ఒక్కటొక్కటే మళ్ళీ మద్దిమాను కొమ్మలకు కాళ్ళను తగిలించుకుని తల్లకిందులుగా వేలాడ సాగాయి.

ఇంతలో 'పెదరెడ్డి'గారి ఇంటి నుండి రెండు మడత కుర్చీలను ఒక హరిజనుడు మోసుకొచ్చాడు. 'గవుర్మెంటోళ్ళి'ద్దరూ ఆ కుర్చీలమీద కూర్చున్నారు. టోపీ మనిషి కూర్చోగానే కుర్చీ కిటకిట మన్నది.

ఆంగ్లంలో కొంతసేపు సంభాషణ జరిపిన తరువాత సన్నటి మనిషి, 'ఇదొక తలనొప్పి వ్యవహారం' అన్నట్లు కణతలనొకసారినొక్కుకుని, రామచంద్రుని వైపు తిరిగి, 'నువ్వేమో మీ పెదరెడ్డి స్వయంగా రిజిస్ట్రాఫీసుకొచ్చి భూమి నీకు పట్టాజేసిచ్చినాడంటావు. అక్కడ చూడబోతే తన మాటను దిక్కరించి నువ్వీ స్థలాన్ని ఆక్రమించుకుని ఉన్నట్లుగా ఆయన మాకు పిటిషన్ పెట్టాడు. ఆ పిటిషన్ మూలాన్నే మాకీ విషయం తెలిసింది. లేకపోతే నువ్విక్కడ ఇల్లు కట్టుకుని ఉండే విషయం మేమేమి కలగన్నామా?" అన్నాడు.

మద్దిమాను కొమ్మల నుండి తల్లకిందులుగా వ్రేలాడుతుండిన పిట్టలు గుడ్లు మిటకరించుకుని మౌనంగా కిందకు చూస్తున్నాయి.

వంచి ఉన్న నడుమును, భుజాలను పైకెత్తకుండా రామచంద్రుడు, "మీరట్ట అడిగితే నేనింగ ఏంవి చెప్పేది సామి. నేనుకూటికి లేనోడ్ని. మాలముండాకొడుకును. నేన్జెప్పేది



# నాకు తెలుసుగా గ్లైకోడిన్ నమ్మకమైనదని-

## ఆమె దగ్గుకు ఇట్టే ఉపశమనాన్ని కలిగిస్తుందని...






**భారతదేశంలో దగ్గులను నివారించే యితర మందులకన్న, గ్లైకోడిన్ ఎందరికో దగ్గునుండి ఉపశమనాన్ని కలిగించింది.**

**అందుకే ఇది ప్రథమశ్రేణికి చెందినది.**

ఇది దగ్గు బాధించే అన్ని భాగాలలోనూ త్వరగా పనిచేసి త్వరితమైన, ఖచ్చితమైన ఉపశమనాన్ని యిస్తుంది.

- గొంతు మంటను తగ్గిస్తుంది.
- కఫమును తొలగించి జలుబు వల్ల వచ్చే దగ్గుల నుండి ఉపశమనాన్ని యిస్తుంది.
- సుఖ నిద్రను కలిగించి, ఛాతీలో కండరాల బిగువును తగ్గించి, సులభంగా శ్వాస పీల్చేందుకు తోడ్పడుతుంది.

దగ్గు ఎలాంటిదైనాసరే—పూర్తిగా అదపులోకి తెచ్చేందుకు మంచి రుచికరమైన గ్లైకోడిన్‌పై మీరు ఆధారపడవచ్చు.




గ్లైకోడిన్—దగ్గులను కొట్టిపడవేయు భారతదేశపు ఛాంపియన్—
విశ్వసనీయమైన మందులను తయారుచేసే అలెంబిక్ సంస్థ ఉత్పాదన.

everest/519/ACW-U

యాడికెక్కుతుంది? నా బిడ్డతోడు సామి. నా కీ నేల పట్టా అయింది సామి. రెండేడ్లు పెదరెడ్డింట్లో సేద్దిగాడుగా పన్జేసిరా సామి. దానికి ఈనాంగా నాకీనేల పట్టాజేసిచ్చిరాడు సామి'' అన్నాడు.

''ఏవి షేవిటి?'' అంటూ సన్నటి మనిషి మడతకుర్చీమీద నిటారుగా కూర్చున్నాడు. టోపీ మనిషి తన భారీ శరీరాన్ని రెండుసార్లు ఇటునటు నెమకి ప్రశ్నార్థకంగా రామచంద్రుని వైపు చూడసాగాడు.

రామచంద్రుడు ''పెదరెడ్డింట్లో సేద్దిగాడుగా ఉన్నానుసామి. రెండేండ్లు సేద్దిగాడుగా ఉంద్రా ఈ నేల పట్టాజేసిస్తా అన్నాడుసామి. ఆప్రకారంవే ఉండి వొళ్ళు గుల్ల జేసుకుని కష్టపడినా సామి. ఆ రెండేడ్లయి నాక నేనీడ ఇల్లుగట్టుకుని నా బతుకు నేను బతకతా ఉండినా సామి.''

అతనిని మధ్యలోనే ఆపుతూ సన్నటి మనిషి ''బతికినంత కాలమూ తన కాళ్ళ క్రింద ఉండలేదే అనే కక్షతో ఇప్పుడతడు నీ కొంపకు ఎసరు పెట్టినాడంటావు. అంతేనా?'' అన్నాడు.

రామచంద్రుడు మౌనంగా నిలుచున్నాడు.

సన్నటి మనిషి 'అదీ సంగతి' అన్నట్లు తల ఆడించి, టోపీ మనిషి వైపు తిరిగి ఆంగ్లంలో సంభాషణ ప్రారంభించాడు.

సూర్యుడు నిప్పులను చెరగుతూ పైకెగ బ్రాకుతున్నాడు.

జీపు డ్రైవరు బీడీని కాల్చడం ముగించి మద్దిమాను చాటునుండి ఇవతలకొచ్చాడు. షర్టు కాలరు క్రింద ఉన్న రుమాలును తీసి ముఖం తుడుచుకుని దానిని మళ్ళీ కాలరు క్రింద సర్దాడు. జీపును సమీపించి దాని ఇంజను నానకుని, చేతులను రొమ్ముమీద కట్టుకుని అట జరుగుతున్న నాటకాన్ని చూడ సాగాడు.

వీనిమిదిమంది పోలీసులు ఆగ్రహారం వద్ద బస్సుదిగి తమ బరువైన బూట్లను చప్పుడు చేసుకుంటూ నడచి వచ్చారు. వారు బొంత జెముడు పొదలవెంత మలుపులిరిగి, వెంపలి చెట్ల గుండా వచ్చి మద్దిమాను నీడను చేరారు. అటనేరి ఉన్న హరిజనులు కొందరు పోలీసు వారి ఎర్రని టోపీలను, దళసరి పటకాలను, లాఠీ కర్రలను, ఎండలో రెండు ఫర్లాంగుల దూరం నడిచి రావడం వలన జనించిన ఆయాసంలో వారు వగర్చు తున్న తీరును ఆసక్తితో పరికించసాగారు.

మరొక వైపు నుండి సత్తిగాడు, తోటివాడు మరినలుగురు హరిజనులు కదు తీరిగా వచ్చి మద్దిమాను నీడను చేరారు. ఆబృందం లోని ప్రతి ఒకడు ఒక గునపాన్ని భుజానవేసుకుని వచ్చారు పదును పెట్టబడిన ఆగునపాల మొనలు ఎండలో మెరుస్తున్నాయి. వారు మద్దిమాను నీడన గునపాలను దిగవేసి వాటి మీదచేతులు వేసుకుని నిలుచున్నారు. ఒకదాని తరువాత మరొకటిగ నేలలోకి దిగుతూ కస్సు కస్సుమని చప్పుడు చేయడంతో రామచంద్రుడు తలత్రిప్పిచూశాడు. అతని చూపులకు సత్తిగాని బృందం ఆనింది. సత్తిగాడు ఎడమ చేతితో ఒకసారి మీసాన్ని దువ్వి వదిలిపెట్టాడు.

'గవుర్మెంటోళ్ళ' ఆంగ్ల సంభాషణ ఒక కొలిక్కివచ్చింది. టోపీమనిషి రామచంద్రుని వైపు తిరిగి లావుపాటి గొంతుతో, ''చూడబ్బాయి. మాలెక్కల ప్రకారం ఈ నాటికి—'' అని ప్రారంభించి ఏదో చెప్పబోగా అతని నాలుక తెలుగు మాట్లాడనని మొరాయించింది. అతడు సన్నటి మనిషివైపు తిరిగి 'నువ్వుచెప్పు' అన్నట్లు చూశాడు,

సన్నటి మనిషి అందుకుని, ''మాలెక్కల ప్రకారం ఈస్థలం ఈనాటికి గవర్నెంటు స్వాధీనంలోనే ఉన్నది. ఎవరిపేరుతోనూ పట్టా చేయ బడలేదు.' అన్నాడు.

రామచంద్రుడు నడుము పైకెత్తి, 'ఐతే నేను పెదరెడ్డింట్లో రెండేండ్లు చేసిన కష్టవంతా ఏమయినట్టు? గొడ్డుమాదిర కష్టపడి ఒక దమ్మిడీ తీసుకోలేదే. ఆ కష్టవంతా ఏమయినట్టు? రిజిస్ట్రారాపీసులో నేను ఏలిముద్దలేసిన కాయితాలు ఏమయినట్టు?'' అన్నాడు.

సన్నటి మనిషి టోపీ మనిషి వైపు, 'మీ అనుమతితో' అన్నట్లు చూసి, మళ్ళీ రామచంద్రుని వైపు తిరిగి, ''ఆ సొదలన్నీ చెప్పి మాకు తలనొప్పి పెట్టొద్దు. ఏలిన్నాటి శని మీ నెత్తిన ఉండబట్టి మీరంతా ఆ రెడ్ల పంచన పడతారు. వాళ్ళు మిమ్మలను వాడుకొనినన్నాళ్ళు వాడుకుని చివరకు కుక్కల్ను కొట్టినట్టు కొట్టి తరుముతారు. ఏ గ్రామానికి పోయినా ఈ కథలే. ఎవరిని కదిలించినా ఈ ఏడుపులే. ఆ ఏడుపులన్నీ వినడానికి మే మిక్కడు రాలేదు. ఈ స్థలంలో ఎలిమెంటరీ స్కూలు కట్టడానికి నిర్ణయమయింది. స్కూలు పని ఈ నెలలోనే ప్రారంభం కావల సింది. నువ్వొచ్చి అడ్డం కూర్చోవడం వల్ల వెనక బడింది'' అన్నాడు.

రామచంద్రుడు తన భుజాలమీదున్న చేతులను దించివేస్తూ, 'మా గోడు మీ యట్టా ఆఫీసర్లకూ పట్టకపోతే, పోలీసోళ్ళకు పట్టకపోతే ఇంగెవురు వింటారు సామి. కలిగినోళ్లు మమ్మల్ను నమ్మించి నమ్మించి మా గొంతులు కోస్తా వుంటే మే మెవర్తో చెప్పకోవాల సామీ'' అన్నాడు.

అతనిని సన్నటి మనిషి మధ్యలోనే ఆపుతు ''ఈ కథలన్నీ వినడానికి మాకు ఓపికాలేదు, తీరికా లేదు. ఈ రోజు పది గంటల లోగా ఈ ఇంటిని నేలమట్టం జేయాలి. అదీ మే మొచ్చిన పని'' అన్నాడు.

సూర్యుడు తన వేడిమినంతా ఉపయోగించి కాల్చినట్లు రామచంద్రుని ముఖం నల్లబడింది. అతని ఎదలో ఉద్రేకం తుఫాను వలె పొంగింది. అంటటి తుఫానును అణచుకునే ప్రయత్నంలో అతని శరీరం యావత్తు

## స్కోరెంత ?-9

పంధొమ్మిదో తేదీ జనవరి ఉదయం మద్రాసు చేపాక్ మైదానంలో చంద్రశేఖర్ మీదకి యింగ్లీష్ బౌలర్ లీవర్ ఒక ఫుల్‌టాస్ విసిరాడు ... ''ఇదుగో యిది మేం గెలుస్తున్న మొట్ట మొదటి సిరీస్ అనగా మూడు టెస్టు మ్యాచ్‌లు మేం హస్తగతం చేసుకున్నాం'' అని యింగ్లాండ్ జట్టు పంపిన విజయ సందేశమా? అన్నట్లు ఆ బంతి చంద్రశేఖర్ ''వాడు'' స్టంప్‌లను పెకిలించి అవతల పడేసింది.

ఇది భారతదేశం ఆడిన 150 వ క్రికెట్ టెస్ట్ పోటీ.. సొంత దేశంలో ''పూలమ్మిన చోట కట్టెలమ్మి''నట్లు అయిన టెస్టుపోటీ.

ఇంగ్లాండు 200 పరుగులతో గెల్చిందన్న దుఃఖం కన్నా - భారత జట్టు అప్రతిష్ఠపాలైన సంఘటన లెన్నో జరిగాయన్న కడుపు మంట క్రికెట్ ప్రియులను పీడిస్తున్నది.

150 టెస్టులు ఆడిన ఇండియా

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

యింత తక్కువ స్కోరు అంటే 100 కన్న తక్కువ పరుగులకు అంతా తిరిగి వచ్చేయడం యిదివరకు 12 సార్లు మాత్రం జరిగింది... ఇంతకన్న తక్కువ స్కోరుకి భారతదేశం పెవిలియన్‌లోకి రావడం లోగడ ఆరుసార్లు మాత్రం జరిగిందని 'స్కోర్' రికార్డులు చెబుతున్నాయి.

1974 నుంచి భారత్ మీద యింగ్లండు గెల్చిన పోటీలో యిది వరుసగా ఐదవది... గ్రీగ్ కాప్టన్‌గా గెల్చుకున్న మొట్ట మొదటి సీరీస్... సమఉజ్జీగా వుండీ అటా? యిటా? అన్నట్లుగా ఆడి, జయాపజయాలు ద్వైవాధీశాలన్న తీరున యీ పోటీలు జరుగుతున్నాయన్న ఆశను "బేడీ" జట్టు నిర్దాక్షిణ్యంగా "కాల రాచింది"— ఆట కూడా పరస్పర నిందారోపణలతో గిల్లికజ్జాలతో జరగటంతో కష్టార్జితాన్ని వందలకి వందలు పోసి టికెట్లు కొన్న క్రికెట్ ప్రియులు మనదాసులో యీ సారి టెస్ట్ మ్యాచ్ వచ్చేదాకా మరిచిపోలేనంత విచారాన్ని మోసుకుపోయారని పరిశీలకుల అంచనా. ★★★

ఇంచుకసేపు సన్నగ కంపించింది. అతడు సన్నటి మనిషివైపు చూసి "మంచి మాట న్నావు సామి. దేవుడు మెచ్చేమాటన్నావు. నేలబడినోనికి చెయ్యిచ్చి పైకితీస్తే ఏ దేవునికి ప్రీతి! పచ్చగ బతికేటోని కొంప ముంచితే నీకు పుణ్యమొస్తుంది. బొందితో సొర్గానికే పోతావు" అన్నాడు.

గవుర్మెంటోళ్లు తమ ముంజేతులకున్న వాచీలను చూసుకున్నారు. సన్నటి మనిషి "ఈ అతితెలివి మాటలన్నీ కట్టిపెట్టు. జరగాల్సిన పని చూడు. టైమైపోతూ ఉంది. మేమీ యిల్లును కూలదోసి పోవాల. ముందుగా లోపలుండే సామాను తెచ్చి బయట పడేసుకో." అన్నాడు.

రామచంద్రుడు తన ఇంటివైపొకసారి చూసి "అదిగూడ ఎందుకు సామి. ఆ సామాను గూడా మీరే బయటకు తెచ్చి వేలంవేసి మీరిద్దరూ పంచుకోండి. మా పెదరెడ్డికి గూడా కొంచెం ఇవ్వండి. మా నెత్తురు ఎంత తాగినా మీకు సాలనిపించదు" అన్నాడు.

గవుర్మెంటోళ్ళిద్దరూ ముఖాలను చిట్లించుకున్నారు. సన్నటి మనిషి మడత కుర్చీమీద నుండి లేచాడు. టోపీ మనిషి లేవడానికి ప్రయత్నించి విరమించుకున్నాడు.

పైకి లేచిన సన్నటి మనిషి "నీ తల తిరుగుడు మాటలు ఏవరిదగ్గర మాట్లాడాలో అక్కడ మాట్లాడు. మా దగ్గిరొద్దు. నీకు ఐదునిమిషాలు టైమిస్తున్నాము. ఈ లోగా ఇంట్లో ఉండేసామాను తెచ్చి బయటపడేసుకో. ఆ తరవాత మా పని మేం చేసుకుని పోతాం." అన్నాడు.

సూర్యుడు తనలోని వేడిమి నంతటనీ ఈపూటే కక్కివేయాలన్నట్లుగా చెలరేగుతున్నాడు. గాలి వేడిని సంతరించుకుంటున్నది.

రామచంద్రుని ఇంటిముందు అర్ధవృత్తాకారంగా చేరిఉన్న గుంపు రెండింతలయింది ఆడవాళ్ళు తమచంకలలో జారిపోతున్న పిల్లలను ఎగనెత్తుకుంటూ నిలుచుని ఉన్నారు. పుడకలవంటి కాళ్ళు, బూరటిల్లిన బొజ్జలు కలిగిన ఆపసిపిల్లలు పరిసరాలను కోపంగా చూస్తూ, అప్పుడప్పుడు ముక్కుతూ ఉన్నారు అగ్గిరోగం తగిలిన వరి కర్రల వలె ఉన్న మగవారు తలపాగాలను తీసి చంకలలో ఉంచుకుని నిలుచుని ఉన్నారు

బిళ్ళ జవాను రామచంద్రునికి చేరువగా వచ్చి రహస్యం చెబుతున్న వానివలె, "మాను మాదిరి నిల్చుంటే ఎట్టయ్యా లోపలకుపోయి చేతికి చిక్కింది గుడ్డా గుసురూ తెచ్చి బయటేసుకో" అన్నాడు.

"ఎందుకేసుకోవాల?" అంటూ రామచంద్రుడు పులిలాగ రొప్పాడు. ఉద్రేకం అతనిలో చిచ్చువలె వ్యాపించింది. విషంవలె వాడలంతా ప్రాకింది. అతని అంగములు పొంగాయి. ఆకృతి మారింది. కంఠం మారింది "ఎందుకేసుకోవాలంట? ఈజాగానాది. ఈ ఇల్లునాది. నాచేతుల్తోనేను కట్టుకున్నది. ఇపుడిది నాదికాదనేది? ఏవడుదీన్ని కూలదోసేది?? రానీ వాడెవుడో. వానితలసెలిగేస్తా రానీ వాడెవుతో."

ఆ మాటల ఉరవడి, ఆకంఠంలోని కరకుదనం నాటి సూర్యుని వేడిమిని అధిగమించాయి ఆడవాళ్ళందరూ పెద్దగా నిట్టూర్పులేశారు. కొందరు అసంకల్పితంగా చేతిని ఎదమీదవేసుకున్నారు. పసిపిల్లలు మెడలను కొక్కరించుకుని మిడిగుడ్లను పెట్టుకుని చూడసాగారు. మగవాళ్ళు పాతి పెట్టిన రాతిస్తంభాలవలె నిలుచుని, సాలోచనగా తలలూగిస్తున్నారు.

టోపీ మనిషి మడతకుర్చీలో నుండి పైకి లేవడంలో సఫలీకృతుడయ్యాడు. లేచిసన్నటి మనిషికి ఆంగ్లంలో ఏదో చెప్పాడు. సన్నటి మనిషి సత్తిగాని బృందాన్ని ఆదేశిస్తూ "ఇకమీరు ప్రారంభించండయ్యా." అన్నాడు.

ఆజ్ఞలభించినదే తడవుగా సత్తిగాడు, అతనితోఉన్న మరి నలుగురు గునపాలను ఎత్తి భుజాలపైన వేసుకుని ఇంటివైపు సాగారు. వారు మద్దిమాను నీడను కదచి, కలాపిసీళ్ళ తేమను, తెల్లని ముగ్గును తొక్కుకుంటూ ఇంటిని సమీపించారు. సత్తిగాడు తనరెండు చేతులతో గునపాన్ని పుచ్చుకుని పుష్టిగా గోడమీద ప్రయోగించాడు. రెండుదోసిళ్ళ ప్రమాణంగల మట్టిపెళ్ళ గోడనుండి ఊడి క్రింద పడింది.

రామచంద్రుడు ఎదలో ఈటె దిగిన పులివలె గాండ్రించి ముందు కురికాడు. అతను సత్తిగాని మెడను దొరక పుచ్చుకొన నుండగా ఇద్దరు పోలీసులు పరుగున అతని జబ్బలు పుచ్చుకుని వెనకకు గుంజారు. వారతనిని రెక్కలను వెనకకు మడిచి వీపుమీద పట్టుకుని మద్దిమాను కిందకు లాగుకొచ్చారు.

పోలీసువారి పట్టునుండి తప్పించుకోవడానికి రామచంద్రుడు తన వొంటిమీదున్న కండలూ తెగిపోతాయా అన్నంతగా ఇదుగులాడుతున్నాడు. పెనుగులాడు తుండగా అతని పాదాల తాకిడికి రేగిన దుమ్ము మేఘంవలె పైకి లేచింది.

"ఒరే సత్తిగా నీ యాలిని— నా ఇంటిమీద చెయ్యేసినావు గదరా నా కొడకా. నే నొచ్చేదాక ఆడనే ఉండరా నా కొడకా. నీ మొకాన మీసం వుంటే ఆడన ఉండ్రా" అంటూ రామచంద్రుడు విపరీతంగా పెనుగులాడుతూ, మోచేతులతో పోలీసు వారిని కుమ్ముతూ, "నన్నిడవండన్నా. వాణ్ణి సంపి బుజానేసుకొచ్చేస్తా నన్నిడవండన్నా వాని నెత్తుర్దీసి సుక్క పెట్టుకోవాల నన్నిడవండన్నా" అంటూ అరవసాగాడు.

సత్తిగాడూ, అతని బృందం తన చేతులలో గునపాలతో అవిరామంగా పని చేస్తున్నారు, వారు ఇంటిమీద పడి గోడలను కుళ్లగిస్తున్నారు.

పోలీసువారి పట్టులో ఉన్న రామచంద్రుడు

మీకు తెలుసా?

## గురువింద గింజంత గోళీలో...

చాలా ఏళ్ల క్రితం భారత దేశపు చేతి కళల నిపుణుడు గురివింద గింజంత దంతపు గోళీ చేశాడు. అది గుల్లగా, రెండు డిప్పలుగా చేశాడు. ఆ గోళీ లోపల దంతపు ఏనుగులు 40 పెట్టేడు. ఆ పనివానితనం ప్రపంచాన్ని ఆశ్చర్య పరచింది.

ఉరల్స్ పట్టణ అర్టెమోవ్‌స్కి నివాసి అలెగ్జాండర్ సిసోల్యాతిన్ యీ భారతీయ కళాకారుణ్ణి మించిన పనివానితనం చూపించాలను కున్నాడు. ఒక చిన్న గిన్నె చేసేడు. దానిలో పట్టే గురువింద గింజంత గోళీ తానూ చేశాడు. అదీ రెండు డిప్పలుగా గుల్లగా చేశాడు. దానిలోపల గ్లాసు గిన్నె పెట్టేడు. ఆ గిన్నెలో టేబిలు. టేబిలుమీద 32 చదరంగపు బల్లలు. వానిమీద పావులు మిగిలిన బలగాలున్నా.

సిసోల్యాతిన్ కృషి మాస్కో స్టేట్ యూనివర్సిటీ మైక్రో బయాలజిస్టుల దృష్టిని ఆకర్షించింది. ఒకదానిలో ఒకటి అమరే మూడు సూదులూ, సూది బెజ్జం లోంచి దూర్చగల సైకిల్ గొలుసూ వారికి కావలసి వచ్చేయి. జీవ కణంమీద సూక్ష్మ శస్త్ర చికిత్స చేయడానికి వీలయ్యే-పరికరం ఒకటి కావాలన్నారు, ఆ శాస్త్రవేత్తలు. అటువంటి పరికరాలకోసం వారు అంతకు పూర్వం దేశంలోని స్పెషలైజ్డ్ కర్మాగారాలకి, విదేశాలలోని అటువంటి యితర కర్మాగారాలకీ ఆర్డర్లు పెట్టడం, సాధ్యం కాదని వారు సమాధానం యివ్వడం జరిగింది. కాని సిసోల్యాతిన్ ఆర్డరు తీసుకొన్నాడు. కొద్ది కాలంపోయేక శాస్త్రవేత్తలకు పది పరికరాల పెట్టె అందింది. దానిలో జీవ కణాన్ని పట్టుకొనేందుకు ఒక చిరు పుచ్చు, ఒక స్కాల్‌పెల్, 0.08 రం ధంగల గుల్లయైన సూది, యితరేతర పరికరాలు వున్నాయి. 20 రెట్లు పెంచి చూసేతప్ప వానిని వుపయోగించడం సాధ్యంకాదు.

అతి సూక్ష్మమయిన మైక్రో – డిస్సెక్టర్లు, విస్తర్లు, అద్వితీయములయిన స్కాల్‌పెల్స్ యింకా యితర పరికరాలు – ఈ ఉరల్స్ చేతి కళా నిపుణుడు తయారు చేసినవి కంటి స్పెషలిస్టులకూ బాగా పరిచితమే సిసోల్యాతిన్ తయారు చేసిన పుచ్చుతో వి. వ్యాత్కిన్ అనే డాక్టరు శస్త్ర చికిత్స చికిత్సలో నిమిత్తం లేకుండా మూత్ర కోశంలో ఏర్పడే రాళ్లను తొలగిస్తున్నారు. అర్టెమోవ్‌స్కి హాస్పిటలులో ఆటోలారింగాలజిస్టులు వాడే ఉపకరణమును 'సిసోల్యాతిన్‌స్పూన్'గా పేర్కొంటారు

ఆయన తయారు చేసిన ఒక వైద్య పరికరంతో నిద్రపోతున్న శిశువు నిద్ర పోతుండగానే దాని గర్భకోశం నుంచి జఠర రసం మచ్చుకోసం తీయవచ్చు. ధమని నుంచి గుచ్చుకున్నట్లు కూడా తెలియకుండానే రక్తం తీయగలంత సూక్ష్మమైన సూది వేరొకటి. [ ఎ. మాల్త్సెవ్. సో. వా. ]

కాలు చేతులు కొట్టుకుంటూ, నడుమును మెడను విల్లులాగ వంచుతూ, పిడికిళ్లను బిగిస్తూ పళ్ళు కొరుకుతూ అరుస్తున్నాడు. అతని కంఠం రాచిపోతున్నది. నోటి నుండి బూతు మాటలు విపరీతంగా దొర్లుతున్నాయి. ఒక పోలీసు అతని చెంపమీద చాచి ఛెళ్ళున కొట్టాడు. రామచంద్రుడు ఒకసారి కాండించి ఉమిసి మళ్ళీ అరవ సాగాడు.

నాగ ఫందుల 'గూడు' వద్ద కూర్చుని కంటికి మంటికి ఒకటిగా ఏడుస్తున్నది.

అట చేరిఉన్న హరిజనుల గుంపు మరి

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

కొంత పెరిగింది. నడుము విరగగా తలను నేలకేసి బాదుకుంటున్న నాగుబామును తలపింపజేసే రామచంద్రుని, పీపుల మీద చెమటలు కారుతుండగా గోడను త్రవ్వుతున్న సత్తిగాని బృందాన్నీ నిశ్చారుగా మౌనంగా నిలుచునిఉన్న ముప్పై అడుగుల ఎత్తు ఇంటినీ చూస్తూ హరిజనులు శిలల వలె నిలుచున్నారు.

సూర్యుడు తన కిరణాలను విచ్చలవిడిగా ప్రసరిస్తున్నాడు. అతని కిరణాల తాకిడికి మేఘాలన్నీ అదృశ్యమైపోయినట్టు, ఆకాశం నిర్మలంగా ఉన్నది. సూర్యతాపాన్ని బాపుకోవడానికై మద్దిమాను కొమ్మల నుండి వ్రేలాడుతున్న పిట్టలు రెక్కలను విసరుకుంటున్నాయి.

రామచంద్రుడు అలసిపోయాడు. నిస్సత్తువ అతనిని ఆవరించింది. అతని కంఠం సన్నగిల్లింది. కనురెప్పలు వాలిపోతున్నాయి. నడుమూ, మోకాళ్ళు వంగుతున్నాయి. మాటలు అస్పష్టంగా వస్తున్నాయి. పోలీసువారు గనక పట్టువదిలితే కుప్పగకూలిపోవడానికి అతడుసిద్ధంగా ఉన్నాడు.

రామచంద్రుని ఇల్లు గునపపు పోట్లతో కంపిస్తున్నది. ఇంటి గోడలు పూర్తిగ మట్టితో తయారైనవి. గోడలలో రాళ్ళుగాని రాతిస్తంభాలుగాని లేవు. సత్తిగాని బృందం ఇంటియొక్క తూర్పుగోడను త్రవ్వడం ముగించారు. ముప్పై అడుగుల ఎత్తుగల ఇల్లు ఫెళఫెళార్భాటాలతో తూర్పుకు పడిపోయింది. దాని పతనం వలన కలిగిన చలనంవల్ల దాపున ఉన్న జిలేడు పొదలు వణికాయి, అట పడిఉన్న విస్తరాకులు కాగితాలు ఎగిరి నాలుగు బారల కవతల పడ్డాయి. అర్ధవృత్తాకారంగా నిలుచుని ఉన్న హరిజనులు అసంకల్పితంగా వెనకకు తగ్గారు. ఆడవాళ్ల చంకలలో ఉన్న పసిపాపలు కెవ్వుమన్నారు. పిల్లవాళ్ళు తల్లుల చీరలలో ముఖాలు దాచుకున్నారు.

మద్ది మానులోని పిట్టలు తమ కంఠాల చుట్టూ బావురు పిల్లి కోరలు దిగినట్లు ఆర్తనాదాలు చేస్తూ గాలిలోకి లేచాయి.

(ఇంకా వుంది)

తాజా వార్తలకు, ప్రత్యేక శీర్షికలకు, వైవిధ్యంగల వ్యాసాలకు
ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి.

## అజంతా ఎల్లోరాల అందాల లోకంలో...



### హరివిల్లు విరిసింది, కావ్యం కళ్ళు తెరచింది

అజంతా ఎల్లోరాల అద్భుత నేతగాళ్ల దగ్గరకు-పెదవి మీద చిన్న ప్రార్థనతో, వారి భావికోసం ప్రణాళికలతో, గుండెడు ఆశతో వెళ్లాం—ఒకనాడు వారు సృష్టించిన నేతల అందాలను తిరిగి సృష్టించడానికీ, వాటి అందాలను అందరితో పంచుకోవడానికీ, వాటిని వేసుకొన్న వారి మనసులను, వాటిని చూసిన వారి హృదయాలను ఆనందంతో నింపడానికీని.

దాంతో ఈనాడు మైమరపించే వస్త్రాలు సాధ్యపడ్డాయి...మీడియం, ఫైన్, సూపర్ ఫైన్ కాటన్లు, మల్ మల్, చీరలు, షర్టింగులు, వాయిల్స్, దుప్పట్లు, సూటింగులు...టెక్స్‌కాం ఉత్పత్తి చేసే ప్రతి వస్త్రంలో—మన పురాతన అందాల వైభవం తొంగిచూస్తుంది.

### వస్త్రాలలో కొత్త అందాలకు టెక్స్‌కాం

టెక్స్‌టైల్ కార్పొరేషన్ ఆఫ్ మరాఠ్‌వాడా లి. అన్‌వికార్ బిల్డింగ్, అదాలత్ రోడ్, ఔరంగాబాద్ (మహారాష్ట్ర)

లింటాస్-TT.4-203 TL

# వారఫలం

మహేష్

**11-2-1977 శుక్రవారం మొదలు**
**17-2-1977 గురువారం వరకు**

**మేషం:—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** మీ ప్రయత్నాలు నెరవేరతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులకు గురి కాగలరు. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. ప్రయాణాలోచనలుచేస్తారు.

**మిథునం:—** వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వారం ఆఖరులో మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కర్కాటకం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**పింహం :—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో మాతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**తుల:—** ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసివస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**ధనుస్సు:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగములో గౌరవం లభించగలదు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**మకరం:—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి, రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో ఫలితం లేని శ్రమ కలుగుతుంది. అధిక వ్యయం చేస్తారు. వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడగలదు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. వారం ఆఖరులో ప్రయాసకు గురికాగలరు. స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

**మీనం:—** అనుకూలమైన వార్తలను వింటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి. ●

## :సత్యం:

ఆశల అశ్వానికి
ఊహల కళ్లెం
తగిలించి
ప్రగతి పథంలో
పయనిస్తున్నాననుకోకు
జీవన సమరంలో
ఆశల అశ్వం
కుంటిదనీ
ఊహల కళ్లెం
ఊడిపోతుందనీ
తెలుసుకుని
హతాశుడవై పోతావు!

— కె. వి. యస్. మణ్యం

# ఫెల్యూర్ డైరీ

## మాంత్రికుని చర్యలా!

కరూరుకు చెందిన తిరుగండియూరులో అరవయ్యేళ్ల కుంజుకేలియన్ అనే ఓ మంత్రగానికి అతని స్నేహితుడు 30 ఏళ్ల తంబి అనే అతనికి ఏదో ఒక విషయం మీద తగాదా వచ్చి అది కొట్లాటగా మారిందట. ఆ కొట్లాటలో మంత్రవాది ఆవేశంలో "నీ పాట్లు కుక్కలు కూడా పడకుండా చేస్తాను చూస్కో" అని తంబితో అన్నాడట. ఈ సంభవం జరిగిన కొన్నాళ్లకాతని తండ్రి చనిపోయాడట. పూర్ణ గర్భిణియైన అతని భార్యపాలానికి వెళ్తే అక్కడ నొప్పులొచ్చాయట. అట్నుంచటే తోటి పనివారామెను ఆసుపత్రికి చేరుస్తే ఆమెకు మృత శిశువు పుట్టాడట. తంబి ఆ శిశువును పారేసి తిరిగి వచ్చేలోగా అతని భార్య చనిపోయిందట. ఈ సంఘటనలన్నీ ఆ మాంత్రికుని చర్యలే అని నిర్ధారణ చేసుకున్న తంబి ఆ మాంత్రికుని తల నరికి రక్తం కారుతున్న కత్తితో మాంత్రికుని శిరస్సుతో నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్ళి లొంగిపోయాడట.

## అసెంబ్లీ హాలుకి ఆరుకోట్లు!

మహారాష్ట్రలో కొత్త అసెంబ్లీ హాలు కట్టడానికి ఆ రాష్ట్రం ఆరు కోట్ల రూపాయలు ఎస్టిమేటు వేసిందట. మన దేశపు ప్రస్తుత ఆర్థిక స్థితికి యింత ఖరీదుతో ప్రస్తుతంలో అసెంబ్లీకి ఒక హాలు కావాలా అనో ఆంగ్ల స్వదేశీ వారపత్రిక రాసిందట.

## రంగు భేదం!

రొడీషియాలో ఒక నీగ్రో గనుక తెల్లజాతి స్త్రీని బలాత్కరించి చెరచినట్లు నిరూపింపబడితే ఆ నీగ్రోకి మరణ దండనట. అదే ఓ తెల్లజాతీయుడు నీగ్రో స్త్రీని చెరుస్తే ఆతనికేవలం పద్దెనిమిది నెలలు జైలు శిక్షేనట.

## బొమ్మతుపాకుల నిషేధం

అయిర్లండ్‌లో ఎవరూ బొమ్మ తుపాకులు చేత ధరించరాదని ఆంక్ష విధించిందటక్కడి ప్రభుత్వం. ఆ దేశపు పిల్లలు బొమ్మ తుపాకులుపుచ్చుకుని తిరుగుతున్నారని, అవి నిజమైన తుపాకులనీ వారు ఒక వేళ గూండాలేమోననే అనుమానించి రక్షణ దళం వారిని కాల్చి చంపేస్తోందట. బాగు బాగు!

## ఆరు ప్రాణాల్ని బలిగొన్న బీడీ!

సేలం సెత్తిపేటలో నూతులు తవ్వేటప్పుడు లోపలి రాళ్లను పేల్చడానికి ఉపయోగపడే నాటు ప్రేలుడు బాంబులు తయారు చేసే ఓ చిన్న ఫ్యాక

నేనింత పెద్ద రచయిత్రిని కావడానికి కారణం మావారి పూర్తి సహకారమే!!!




...లో పని చేస్తున్న నల్లమ్మాల్ అనే అమ్మాయి కోసం ఆమె తమ్ముడు 35 ఏళ్ల వరదన్, ఆమె కూతురు పదేళ్ల శాంతితో వెళ్లాడట. అతనినోట్లో బీడీని చూసిన నల్లమ్మాల్ ఆ బీడీని పారెయ్యమం డట. వరదన్ బీడీని కిందపడేసి కాలుతో రాసేలోగానే నేలమీదున్న మందుకు మంటందుకుని, సరసర పాకి, నాటు బాంబులన్నీ ఒకేసారి అంటుకున్నాయట. అవన్నీ డామ్మని ప్రేలేసరికి ఆ పాక చిన్నాభిన్నంగా చెదిరి, ఎగిరి పోయిందట. పదేళ్ల శాంతి ఆకాశంలో పదడుగులు ఎగిరి, పక్కనున్న వేప చెట్టులో చిక్కుకు చనిపోయిందట. వరదన్ కళ్ళు రెండూ భయంకరంగా వూడిపోయాయట. నల్లమ్మాల్ కాలి మస్సై పోయిందిట. ఆమే గాక, పని చేస్తున్న యింకా నలుగురు మనిషారు కూడా కాలి చనిపోయారట.

**పొగ మానడానికి!**

ఇంగ్లండులో సిగరెట్టు కాల్చడం మానాలనిగాని తగ్గించాలని గాని కుతూహలపడే వారికి సహాయపడ్డం కోసం ఓ రకం చూయింగ్ గమ్ [రబ్బరులా సాగి నమిలే పదార్థం] తయారు చేస్తున్నారట. ఇది కాస్సేపు నమిలి, ఆనక సిగరెటు కాలిస్తే ఆ సిగరెట్టు రుచిగా వుండదట. దీనివల్ల సిగరెట్టు మీద కోర్కె నశిస్తుందని ఆ తయారీ వారి అంచనా అట!

(48 వ పేజీ చూడండి)




*(గత సంచిక తరువాయి)*

మరుసటి ఆదివారం రంగారావు, వెంగన్నారావు, రెడ్డి మెంబర్ షిప్ డ్రైవ్ మీద బయల్దేరారు. ప్రతివాళ్లు "చందాలు అడుగుతున్నారు కదా! ఈ సంస్థ ఆశయాలేమిటి? కాన్‌స్టిట్యూషన్ ఉందా? ప్రెసిడెంటెవరు?" అంటూ అడగటం మొదలు పెట్టారు. పద్మావతిదేవి కూడా "మీకేవి లేకపోతే సర్వసభ్య సమావేశం పెట్టి ప్రెసిడెంట్లని వాళ్లని ఎన్నుకుందాం" అంది.

రంగారావు "నెలకో నాటకం వెయ్యడం దీని ఆశయం. నాటకం వెయ్యటానికి నటులు దర్శకులు ముఖ్యం గాని అధ్యక్షులు వాళ్లు కారు. మనమేం రిజిష్టర్ చేసుకోబోవడం లేదు కనక కాన్‌స్టిట్యూషన్ అనవసరం" అన్నాడు మిగిలిన శ్రద్ధతో ఆ పాయం(త్రం.

"నిజమేనండి గురువుగారు! ఈపాటి దానికే హడావిడీ, అనవసరం" అన్నాడు వెంగన్నారావు.

"కాదు మనకో రాజ్యాంగం అదీ ఉండి, నాటకాలు వేయడం ఒక ముఖ్యాశయమే అయినా, వేరే కొన్ని ఆశయాలను కూడా జోడించి, పెద్దవాళ్ళ నెవర్నైనా అధ్యక్షులుగా ఎన్నుకుంటే మన సమితికి ఢోకా ఉండదు. పెద్దల అండదండ లుంటాయి." అన్నాడు రెడ్డి. రెడ్డికి పెద్దలంటే ఉన్న గురికొద్దీ.

"అదీ నిజమేనండోయ్" అన్నాడు వెంగన్నారావు.

"సర్వసభ్యసమావేశం ఏర్పరిచి సభ్యుల అభిప్రాయలను తెల్సుకోవడం వాటిని గౌరవించటం ధర్మం, మనం ఆఫ్టరాల్. వాళ్లిచ్చే చందాలమీదే ఆధార పడబోతున్నాం కదా" అన్నాడు రెడ్డి.

"మరే అది మన కనీసం ధర్మం" అన్నాడు వెంగన్నారావు. రంగారావు శిరసా వహించాడు. సర్వసభ్య సమావేశం అప్సర్ ప్రైమరి స్కూల్లో, వాళ్లని బతిమాలి కొని ఒక క్లాసురూంలో ఏర్పాటు చేసాడు.

వందమంది సభ్యుల్లోను ఓ ముప్ఫై మందిదాకా వచ్చారు అనుకున్న సమయానికి. మరో పదిమంది మీటింగ్ పూర్తయ్యే సమయానికి వచ్చారు తెలుగు సంఘాన్ని "రిజిష్టర్ చేసే లాభాలున్నాయి కనక రిజిష్టర్ చెద్దామంది" పద్మావతిదేవి.

"ఏమిటా లాభాలు?" అని వెంగన్నరావు కుతూహలంగా అడిగాడు.

"గవర్నమెంటు గ్రాంట్లివ్వాలన్నా, కమర్షియల్ టాక్స్ ఆఫీసరు మనల్ని ఓ బెనిఫిట్ షో వేసుకోనివ్వాలన్నా రిజిష్టరవటం మంచిది" అన్నాడు పద్మావతిదేవి భర్త.

"మనదానికి వంద మంది సభ్యులు. అబదువందల రూపాయల ఆదాయం. దీనికి ఓ రిజిష్ట్రేషన్ ఆడిటర్స్, బాలెన్సు షీట్లు హడావిడి అనవసరం" అన్నాడు రంగారావు.

"అదేంమాట. మన సంఘం ఎప్పుడూ అలా చిన్నగానే ఉంటుందా! ఎప్పుడూ నాటకాలు మాత్రమే వేస్తామా! సంఘం అంటూ ఉన్నాక తెలుగు వాళ్ల కుపయోగపడే కార్యక్రమాలు పెట్టుకోవా!" అంది పద్మావతి దేవి.

రంగారావు "ఈ సంఘం మేం పెట్టుకోడంలో ఉద్దేశం నెలకో నాటకం వేసుకొందాం అని నాటకాలని చూడటాని కిష్టపడే వాళ్లని సభ్యులుగా చేర్చుకొందామని అనుకొన్నాం" అని స్పష్టం చేసాడు.

నవరక్తిని. నవశక్తిని కలిగించే

నెస్కాఫే కమ్మని రుచితో
నూతనోత్సాహాన్ని
పొందండి.

నెస్కాఫే®




నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ
మైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ



ప్రపంచంలోకెల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

NSC-1/77 TEL

# సంఘ పురాణం....

"నిజమేనండి రంగారావుగారు! పెట్టుకొనేటప్పుడు మనదదే ఉద్దేశం. జేరినప్పుడు సభ్యులది ఆదే ఉద్దేశం. కాని జేరాక సభ్యులకి వేరే ఉద్దేశాలుండచ్చు కదా! విందాం. సభ్యులందరిది ఒక ఉద్దేశం. మనదొకటి అయితే మనం కూడా వాళ్ళ మార్గాన్నే పోవటం ధర్మం" అన్నాడు రెడ్డి.

ఒకొక్క సభ్యుడే లేచి తన ఉద్దేశంలో సంఘం ఎలా వుండాలో చెప్పాడు. ప్రతివాళ్ళ ఉద్దేశం కూడా ఈ సంఘం చీమలపేటలోని సభ్యుల్ని ముందుగాను, ఆ పట్నంలోని తెలుగు వాళ్ళని తరవాత, ప్రవాసాంధ్రుల్ని అంతా ఆ తరవాత, దేశంలోని ఆంధ్రుల్నంతా ఇంకొంచెం ఆ తరువాత, ప్రపంచంలోని ఆంధ్రుల్నంతా మరి కొంచెం ఆ తరువాత, ఒకే తాటి మీద నడిపించి చరిత్రలో తెలుగువారి స్వర్ణయుగాన్ని తిరిగి భూమ్మీద స్థాపించాలనే దానికి సంవత్సరానికో రోజు పెద్ద పెట్టున కార్యక్రమాల్ని ఏర్పాటుచాలని అన్నారు ఆరోజు గురజాడ జన్మదినమో, కందుకూరి వర్ధంతి దినమో అయితే బావుంటుందని కొందరన్నారు. మరికొందరు త్యాగరాజ దినం పెడ్దామన్నారు కృష్ణదేవరాయల పేరు శాతవాహనుల శాలివాహనుల పేర్లు బయటికి వచ్చాయి. కాస్సేపోటు శాతవాహనులు శాలివాహనులు ఒకళ్ళేనేమోనన్న విషయం గురించి అనుమానపడ్డారు. చివరికి తెలుగు వాళ్ళకి ముఖ్యమైనపండుగ సంక్రాంతి కనక సంక్రాంతికి ఈ కార్యక్రమాన్ని ఏర్పరచాలని నిర్ణయించారు.

"రోజంటూ నిర్ణయమైంది కనక ఆరోజు నాటికల పోటీ నిర్వహిద్దాం. అప్పుడు చీమలపేట సభ్యులకి మిగిలిన పేటల్లో ఉండే తెలుగువారి నటనా నైపుణ్యాన్ని చూసి ఆనందించే అవకాశం కలుగుతుంది, ఎలాగో నాటకాలపోటీ నడుపుతున్నాం కనక ఆరోజున ఆంధ్రుల అభిమాన నటుడి కొకరికి సన్మానం చేసి ఆయనచేత బహుమతిప్రధానం చేయిస్తే బావుంటుంది." అన్నాడో ఆయన. "అయిడియా బాగానే ఉంది" అన్నాడు వెంగన్నరావు. "ఆరోజున కావాలంటే మా అమ్మాయిచేత నటుడి మెడలో దండ




వేయించవచ్చు." అంది పద్మావతి దేవి ఆవిడ అనాథ ఆశ్రమం కోసం చందా అడిగినవారికి అనాధలను దానం చేసే బాపతు ఏడాదికో అభిమాన నటుడిని పిలిచే విషయంలో ఏకాభిప్రాయం కుదిరిపోయింది. ఆయన భుజం రాసుకుంటూ ఎవరు కూర్చోవాలన్నది తరువాత ఆలోచించ వచ్చుననుకున్నారు. ఆ విధంగా వామనుడి కాలు భూమంతా ఆక్రమించింది.

ఆ సభలో రామనాథం ఉన్నాడు. ఆయనకు స్కూలుకు వెళ్తున్న పిల్లలున్నారు. వాళ్ళు మూడు సంవత్సరాల క్రితం తెలుగు దేశంలో తెలుగు చదువుకొని తండికి ట్రాన్స్ఫర్ అవగా ఈ ఊరువచ్చి యాభైవేలమందున్నారని గర్వంగా చెప్పుకొనే ఊళ్లో తెలుగుచెప్పే స్కూలు దొరకక, ఏ స్కూలుకి వెళ్ళినా "ఇంతవరకు తెలుగు చదువుతామని వచ్చింది మీరే" అని ఆ స్కూలు అధికారులంటుంటే ఏం చెయ్యాలో తోచక స్వంత బాధ్యత మీద తెలుగు చదువుకునే ఏర్పాటు మీద తలో స్కూల్లో జేరిపోయారు. అన్ని రాష్ట్రాలలో లాగానే ఆ రాష్ట్రంలోను అల్పసంఖ్యాక వర్గాన్ని రక్షించేందుకు రక్షణ సమితుంది. అయిదుగురికి మించి తెలుగు చదువుతామని ముందుకు వస్తే తెలుగు మేష్టర్ని, స్కూళ్ళలో ఏర్పాటు చెయ్యాలన్న నిబంధన ఉంది.

"అయితే ఎవరు మటుకు వాళ్ళు మనకే ఇంకెవరికి తెలుగు అక్కర్లేదుగా మోసు" అనుకోడంతో ఎవరూ ఆ రక్షక సమితి వద్ద మొరపెట్టుకోలేదు. కాని ఈ మధ్య రామనాథానికి తన పిల్లలు చదువుకొంటున్న బళ్ళో ఇల్లాగే మోసపోయిన పిల్లలున్నట్టు తెలిసింది.

అందుకని రామనాథం ఆ సభలో "ఈ సంఘం ద్వారా మనం స్కూళ్ళలో తెలుగు విషయమై అలజడి చెయ్యాలి" అంటూ గట్టిగా చెప్పాడు. "అది వీలు కాకపోతే మనమే ఓ స్కూలు నడుపుదాం" అంటూ ఉద్రేక పడ్డాడు.

"మనకంటూ ఓ భవనం ఉన్నప్పుడే అది వీలవుతుంది" అని రంగారావు నోరుజారాడు. "కడ్దాం" అన్నారు సభ్యులు ముక్తకంఠంతో "అదే మన తక్షణ కర్తవ్యం" అన్నారు ఉద్రేకం పాలు ఎక్కువ ఉన్నవారు.

"పేట పేటా ఓ తెలుగు పాఠశాల" అంటూ ఓ యువకవి నినాదాన్ని రూపొందించాడు సభ్యులు దాన్ని బలపరిచారు.

వామనుడి మరోకాలు ఆకాశం అంతా ఆక్రమించింది.

"మనం ఈనాడు చేపట్టిన కార్యక్రమం నడిపించే సారథుల్ని మనం ఎన్నుకోవాలి" అన్నాడు రామనాథం.

"అందులో ఒకరైనా ఆడవాళ్ళుంటే బావుంటుంది" అన్నాడు పద్మావతీదేవి భర్త.

"రామనాథంగారు అధ్యక్షుడిగా ఉంటే బావుంటుందని పద్మావతీదేవి ఆవిడ ఉపాధ్యక్షురాలిగా ఉంటే బావుంటుందని రామనాథం గారు సూచించారు సభ్యులు ఆమోదించారు.

రెడ్డి, తనకి కోశాధికారిగా ఉండటానికి అభ్యంతరం లేదన్నాడు.

కార్యదర్శిగా ఉత్సాహవంతుడైన యువకుడుండాలని దానికి రంగారావే తగునని రామనాథంగారు అన్నారు. సభ్యులు చప్పట్లు కొట్టారు. వామనుడు తన మూడోకాలు రంగారావు తలపై నుంచాడు.

రంగారావు, తను అమ్మాయిని చెయ్యబోతే ఈ సంఘం అమ్మవారై కూర్చుందే అటువంటప్పుడు తను నెగ్గగలడా అని కలవర పడ్డాడు.

ఆపైన తెలుగు సంఘం పేరు ప్రభుత్వపు రిజిష్టర్సులో జేరిపోయింది.

[ఈ సారి మరోకథ]

# మా పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
# మా పైర్లకు అవసరం విజయ్

పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాలుబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి వరిపైరుకు యూరియా మాత్రమేవేస్తే సరిపోద్దాఅని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...వరి మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తినికూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాలుబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

## వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ. | ఎకరాకు రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1200 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 1740 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1300 | 1920 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 220/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 720/_ ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు. విజయ్ 17-17-17లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

విజయ్ ఎరువులను వాడండి___అధిక లాభాలను పొందండి.




విపులంగా తెలుసుకోవాలంటే
యీక్రింది చిరునామాకు వ్రాయండి.
ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ, హైదరాబాద్-500-028






MFL-1162

సీరియల్

# మగదిక్కు

## పైడిపాటి. సుబ్బరామశాస్త్రి

(గత సంచిక తరువాయి)

గంగమ్మ యీవిధంగా కసి క్రక్కుతూవుంటే, ఆ ఇంట్లో వుండడం దుర్భరంగా భావించింది సురేఖ. తనకు జరిగే అవమానాన్ని చూడకుండా వెళ్ళిపోయిన తండ్రి అదృష్టవంతు డనుకుంది: గంగమ్మ 'వెలుపల' వున్నప్పుడు సురేఖ మడి కట్టుకోవడం అలవాటు ఎప్పుడూ వుంది అప్పుడు గంగమ్మ "నీ వంట చాలా బాగుంటుంది వదినే!" అనేది. ఇప్పుడు — "అబ్బ! ఉప్పుకషాయం! యీ కూరలో యింత ఉప్పు తగలేశావేం" అని కొద్దిగా ఉప్పు యెక్కువయినా అనడం ప్రారంభించింది.

కారం యెక్కువ కాకపోయినా, "అబ్బో! ఖారం! యీ పేపుడు తింటే వేడిరోగాలు పుట్టుకు వస్తాయి. మిరపకాయలన్నీ మూడురోజులలో ఫైసలవుతాయి" అని అనడం ప్రారంభించింది. గంగమ్మ ఎక్కడికయినా పేరంటానికి వెళ్ళవలసి వచ్చినప్పుడు, సురేఖ వంట చేసేది. చేస్తే ఒకప్పుడు సహించేది. ఒకప్పుడు "నువ్వు మడి కట్టుకోవడం దేనికమ్మా! నెలకు వందరూపాయలు మాకు పోయడంకాక యీ కష్టంకూడా దేనికి నీకు?" అనేది. ఒకప్పుడు సురేఖను, కట్టుకున్న మడిని మధ్యలో విడిపించి, తాను వంట సమాప్తి చేసేది.

ఆడవాళ్ళలో వుండే యీ అల్పగుణాలను గూర్చి అన్నకు ఫిర్యాదు చేయడం యిష్టంలేక సురేఖ ఊరుకునేది. అందరి ఆడవాళ్ళలో మాత్రం ఇల్లాంటివి వుంటయ్యా? కొందరిలో తప్పక వుంటాయి. మా వదినె మచ్చుతునక — అని అనుకునేది. అన్నా వదినే, యీ సందర్భంలో ఒక్కటే అని తెలిసినా, రాజయ్య ఒకప్పుడు ధర్మపక్షం వంకకు మొగ్గవచ్చుననీ, వదినెకూ అన్నయ్యకూ ఒకప్పుడు చెడితే, ఆ పాపం తనకు రావచ్చుననీ, తానెంతో పాపం చేసిన కారణంచేత ఎడబాటును అనుభవిస్తున్నాననీ సురేఖ అనుకుంది. తన చేతిలో సొమ్ము వున్నప్పుడే, వదినె తననీ విధంగా చూస్తే, తన కున్నదంతా యిచ్చేస్తే, తన చేతికి వచ్చేది చీపురుకట్టా, అలుకుగుడ్డా, అని నిర్ణయించుకుంది. అందుకనే తండ్రికాని, భాగ్యరేఖ కాని, ద్రవ్యం వాళ్ళ పరం చేయమని చెప్పలేదు. పైగా అల్లా చేయడానికి వాళ్ళు విముఖులు

సురేఖ భాగ్యరేఖకు యిక్కడ జరిగే వ్యవహార మంతా జాబుల్లో వ్రాసింది. తన ఓర్పు సన్నగిల్లు తోందని వ్రాసి, సమాధానం మ్యాలు చిరునామాకు వ్రాయమని వ్రాసింది. తిరుగు టపాలోనే భాగ్యరేఖ నుండి సమాధానం వచ్చింది.

"దురదృష్టవంతురాలవయిన చెల్లెలా! చిరంజీవి సౌభాగ్యవతి, సురేఖా!

ఓర్చుకున్న గొడ్డుకు తేటనీరు—అని సామెత. నేను చెప్పేదల్లా, ఓర్చుకో, ఓర్చుకో, ఓర్చుకొమ్మని. పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డవారుకాదు. మహా మహావాళ్ళే కష్టాలు పడ్డారు.

"నుదుటన్ వ్రాసిన వ్రాతకన్న కలదా నూరేండ్లు చింతించినన్" అన్నట్లు నుదుట వ్రాయబడితే అనుభవించవలసిందే. అయితే ఆ అనుభవించేది గొడ్డువలె కాక, వివేకంతో అనుభవించాలి. అది కర్తవ్యం.

ఆడవాళ్లకు పుట్టిల్లుకాని, అత్తిల్లుకాని విధాయకం. మూడవచోటున వుండడంకంటె మరణం మేలు. అయితే, కాలంలో మార్పునుకాని, పరిస్థితుల ప్రాబల్యాన్నికాని నేను గుర్తించలేనిదానను కాను. నీకు అత్తింటి పొత్తు ఎప్పుడో పోయింది. పుట్టింటితో పొత్తుకు విఘాతం వస్తున్నట్లు కన్పిస్తోంది. అదీకాక నీ మెడకు గుదిబండ ఒక వుద్యోగం, అది తప్పనిసరి. అక్కడా, ఇక్కడా, చాకిరీ చేస్తున్నా, భగవంతుడికి అనుగ్రహం కలుగ లేదంటే, నిజంగా బాధగానే వున్నది.

నా మాటమీద నీకు ఏమాత్రం విలువ వుంటే, నేను చెప్పేది ఒక్కటే సంగతి నీవు గమనింపదగినది. ఏ పరిస్థితులలోనూ అన్నయ్య అండను నీవు వదలుకోబోకు. అన్నయ్య పర్యవేక్షణలో, ఆ పేటలోకాని, మరొక పేటలోకాని, నీవు విడిగా వుండడానికి అవకాశమున్నదేమో పరిశీలించు. అన్నయ్య పర్యవేక్షణలో వుంటే వుండే ప్రయోజనం ఏమంటే — పుట్టింటివారితో ఇది పోట్లాడి వచ్చింది, అత్తింటితో తెగతెంపులు చేసుకుంది, ఇది ఒంటరిది, అని ఇతరులు రాళ్ళు వేయకుండా వుంటారు.

పుట్టింటి నుండి బయటకు వెళ్ళవలసిన దుర్యోగం నీకు కలిగితే, పుట్టింటివారి మనస్సు నొప్పించకుండా, తెలివిగా, హుందాగా వెళ్ళు. వాళ్ల వల్ల కలిగే సహకారం ఎంత అల్పమైనదయినా, అది పొందే అవకాశాన్ని మాత్రం చెడగొట్టుకొని 'పెడ కట్టె' అని అనిపించుకోకు. దూరాన వున్న నేను నీకు, ప్రస్తుతం చేయగలిగిన ఉపదేశమిదే.

అన్ని దారులూ మూయబడి, ఒకప్పుడు వుద్యోగానికి కూడా ఏదయినా 'పేటన' వస్తే, నీవు నిస్సహాయననుకొని అఘాయిత్యం చేసుకోబోకు - నీకు పట్టెడన్నం పెట్టడానికి ఎప్పుడయినాసరే, నేను వున్నాను. నా కొడుకులూ, కోడళ్లూ, నీ విషయంలో నాకు ఎదురు తిరిగితే, నేను స్త్రీధనంతో నా పేర కొనుక్కున్న ఎకరం పొలం నీ పేర వ్రాస్తాను. దానితో బ్రదుకవచ్చు

ఇట్లు, ఆశీస్సులతో.
భాగ్యరేఖ,

ఉత్తరం ముగించిన తర్వాత తిరిగి వ్రాస్తున్నానంటే దీని ప్రాముఖ్యం గమనించు.

చెల్లీ! ఉద్రేకంలో ఏ పనీ చేయరాదు. రెండు మూడు సార్లాలోచించిన తర్వాతనే చేయాలి. "ఆడదాని చేతి అర్థం, మగవాడిచేతి బిడ్డ దక్క" దని సామెత నీవు విడిగా వుంటే, నీకు నీవు స్వతంత్రురాలవనే భావం కలుగుతుంది. కొందరు నిన్ను స్తోత్రం చేసి, నీ డబ్బు కాజేయాలని చూస్తారు. కొందరు ఎక్కువ వడ్డీ యిస్తామని నీ కాశ కల్పించి, మొదటికే మోసం తెస్తారు. స్తోత్ర ప్రియత్వం, స్వభావంగా వుండే జాలి లక్షణం, స్త్రీని ఒకప్పుడు నష్టపరుస్తయ్.

నీ దగ్గర వున్న సొమ్మును నువ్వు పోగొట్టుకొన్నావో, నీ పాట్లు కుక్కలూ, నక్కలూ కూడా పడవు. ఇంతకంటె నేను నీకు వ్రాసేది. లేదు. నేనెంత వ్రాసినా ఎవరి కర్మ వారిది.

ఇట్లు — తిరిగి ఆశీస్సులతో,
నీ భాగ్యరేఖ.

సురేఖ జాబును మూమ్మాఱు చదువుకుంది. అక్కయ్య వ్రాసినదానిలో తప్పేమీ లేదని అనుకుంది. సాయంత్రం యింటికి వచ్చింది కాని ఆ రాత్రి సురేఖకు నిద్ర పట్టలేదు. అత్యవసర పరిస్థితిలో, అన్నకు నొచ్చకుండా, ఇంటినుండి వైదొలగడం ఒక్కటే పరిష్కారమార్గం. దీనికి అక్క ఆమోదించింది — అనే సంతృప్తి వున్నా, ఆ యింటిలో నుండి వెళ్లిపోవలసి వచ్చిందనేటప్పటికి సురేఖకు కళ్లనీళ్ల పర్యంతమయింది.

సురేఖ నిద్రపోయినదనుకొని గంగమ్మ, రాజయ్యతో చెప్పిన మాటలిలా వినిపించినై:

"ఏమండీ, మనం పిల్లలు కలవాళ్లం. మీ చెల్లెలికి పిల్లా పీచూ లేరు. మీకు సంసారంలో ఎప్పుడూ చేవెలితే. సురేఖ సొమ్ము మన సంసారం క్రిందకు రావడానికి నేనెంత ప్రయత్నం చేసినా ఫలించడంలేదు.

నా లెక్క ప్రకారం, అప్పుడే, వదినె దగ్గర

**జరిగిన కథ-5:** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చిలమ్మ. ఆస్తి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్తి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఎ. పూర్తి చేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. తను తన సంపాదన దాచుకోవడం అన్నకి కంటగింపుగా వుందని అతని మాటలవల్ల గ్రహిస్తుంది సురేఖ. సురేఖ తండ్రి మరణిస్తాడు. సురేఖపట్ల పెడసరంగా వుంటుంది వదిన గంగమ్మ.

పదివేలు చేరినై ఆడదాని దగ్గర, అందులో బిడ్డా పాపా, లేని ఆడదాని దగ్గర అంత సొమ్ము చేరడం శ్రేయస్కరం కాదు. ఎప్పుడే బుద్ధి పుడుతుందో తెలియదు. తరువాత ఏమని అనుకున్నా ఏమీ లాభం లేదు.

మీరు అన్నగారు. ఆవిడ చెల్లెలు. నేను పరాయిదాన్ని, నేను కల్పించుకొని ఏమి అన్నా, అప్రతిష్ఠ పడిపోతాను. మీరూ మీరూ అన్నా చెల్లెళ్ళు కనుక మీరేమయినా అంటే, ఎబ్బెట్టుగా వుండదు.

"అమ్మాయీ! ఈ ఇంటి బరువు బాధ్యతలన్నీ మోసేవాడిని నేను. నువ్వూ మా కుటుంబంలో మనిషివే అయిపోయావు. నీ సంపాదన అంతా నా చేతి కిచ్చేస్తే యీ కుటుంబానికి నేను యజమానినన్న పరువు దక్కుతుంది. లేకపోతే నువ్వు యీ ఇంట్లో దేనికి? అని అనివేయండి.

ఇప్పుడు మనకు మామగారి భయంలేదు. మీరల్లా అంటే ఆడది యివ్వక ఏ చెరువు నీళ్ళు తాగుతుంది? నేనింకొకచోటికి పోతాను అని అనగలదా? ఒకవేళ అన్నదనుకోండి. కీడెంచి మేలెంచుదాం. పీడ వదలిపోతుంది"

మిగతా మాటలన్నీ రాజయ్యకు తానున్న స్థితిలో బాగానే వున్నవనిపించినవికాని, తన చెల్లెలిని గూర్చి ఆ చివరమాట వినలేకపోయాడు. అయినా ఒక క్రమంలో అనివేసిన మాట కనుక, దానిని పురస్కరించుకొని మందలించమూలేకపోయాడు. రాజయ్య ఏమి సమాధానం చెబుతాడా అని, సురేఖ చెవులు రిక్కించి వింటోంది.

రాజయ్య యిలా అన్నాడు:

"సురేఖ జీతం మనకు రావడం, మనం యిబ్బందులలోనుండి బయటపడడం నాకిష్టమే. కాని సురేఖ, 'అన్నయ్యా! యిది నాన్న చేసిన ఏర్పాటుకదా! ఆయన బ్రతికివుండగా మెదలకుండా ఊరుకొని, ఆయన చచ్చిపోయిన తర్వాత ఆ ఏర్పాటు విరుద్ధంగా నన్ను నడుచుకోమనడం న్యాయమేనా?' అని అది నావంక బిక్కముఖంపెట్టి చూస్తే, నేనేమీ చెయ్యలేనే, నాకు జాలి కలుగుతుంది. ఏడుపు వస్తుంది. అక్కడ మొగుడి దగ్గరకూ వెళ్లక, ఇక్కడ మనదగ్గరా వుండక ఏమయి పోతుందే?"



"ఇంత జాలి గుండె వుంటే వ్యవహారం కుదురదు. అసలు మిమ్మల్ని భగవంతుడు మగవాడుగా యెల్లా పుట్టించాడో నా కర్థంకాదు. నాకు సంతానాన్ని యివ్వడంకోసం మాత్రమే పుట్టించివుంటాడు. మనమీద ఆధారపడ్డ ఒక ఆడదాన్ని, డబాయించి, మనకు కావలసిన పని పూర్తిచేసుకోలేనివారు ఏమి మగవారండీ! నాకర్మ! నేనేమయినా మీ చెల్లెలిని కర్రపెట్టి వీధిలోకి గెంటమని చెప్పానా, ఏమన్నా? ముత్యమంత మాట 'నువ్వు యీ ఇంట్లో వుండాలంటే, నీ జీతం పూర్తిగా మాకు యివ్వాలి' అని కాస్త నోటితో గద్దించి అనడం, అల్లా మీరు అనగలిగితే 'అన్నయ్యా! నీ యిష్టం. నువ్వు ఎల్లా చెబితే అల్లా వింటాను' అని అనదూ? ఆ రోజు ఆలస్యంగా ఇంటికి వచ్చినందుకు మీరు హంగామా చేస్తే 'నేను యికముందు అల్లా రాను అన్నయ్యా' అని, దారికి రాలా?" అన్నది గంగమ్మ.

"ఇస్తే మంచిదే. యివ్వనని అంటే, నువ్వు బయటకు పొమ్మని, అందాకా వచ్చిన తర్వాత నేను పట్టుపట్టాలి. పట్టుపట్టడం నా కిష్టంలేదు. 'సరే అన్నయ్యా! నీ కంత నేను బరువయితే, వేరే చోట కాచుకు త్రాగుతానని వెళ్లిపోయిందనుకో. అప్పుడు మనకు దాని వందలో మిగిలే యాభై రూపాయలు పోతాయి. ఇంటి చాకిరీ అంతా, పిల్లలు గలదానవు నువ్వే చచ్చినట్లు చేసుకోవాలి. ఎప్పుడయినా, "ఇబ్బందిలో వున్నానమ్మా! ఒక వెయ్యి రూపాయలు సర్దు" అని చెల్లెలిని అడిగే అవకాశం లేకుండాపోతుంది. దాని మనస్సు విరిగిపోతుంది. నీ సలహా తెలివైనది కాదు".

"సరి సరి! వీసె గుండు వేస్తే ఎక్కువవుతుంది. అరవీసె గుండు వేస్తే తేలిపోతుంది. ఏది వేయను? అని సందేహించేవాళ్లతో ఏ పనులూ కావు. మీకు చేతకాకపోతే నేనే ఏదో సందర్భాన్ని కల్పించుకుని చెప్పేస్తా".

"నీది ప్రళయాంతకమైన బుద్ధి! ఆ పని మాత్రం చేయకు. నాన్న పోయి ఏడాది అయినా కాలేదు. అది ఉసూరుమని ఏడుస్తుంది."

"చేసితీరుతాను. నా సంసారం కోసం నే చేస్తాను. మీకు చెల్లెలని ఏమయినా జాలి వుందేమో! నాకేమీ లేదు. అత్తింట్లో వుంటే చెల్లెలని మర్యాదకాని పుట్టింటికి చేరిన దానికి మర్యాద ఏమిటండీ!"

ఆపైన రాజయ్య మాట్లాడలేదు.

ఈ సంభాషణంతా పూస గ్రుచ్చినట్లు సురేఖ భాగ్యరేఖకు వ్రాసి పోస్టు చేసింది. సరోజినితో తన పరిస్థితి అంతా, ఏమీ దాచకుండా చెప్పింది.

సరోజిని యిలా అంది:

"అక్కా! మన పెద్దక్క వుద్దేశం, నువ్వు వారితో మంచిగా విడిపోయి, మీ అన్నయ్య పర్యవేక్షణలో వుండమని. మీ వదినె నిన్ను బయటకు పొమ్మన్న రోజున నువ్వు బయటకు రాక తప్పదు. అప్పుడు భాగ్యం అక్కయ్య చెప్పినట్లుగా నువ్వు చేసినట్లు కాదు. నీకూ, ఆ కుటుంబానికీ సత్సంబంధాలు వుండనేరవు. అందుచేత, నీ వదినెచేత అల్లా అనిపించుకోకముందే నువ్వు బయటకు వచ్చేయడం తప్ప గత్యంతరం లేదు. ఇప్పుడు బయటకు రావడం అనేది నీకు అవసరం అవుతోంది.

మా ఇంటి ప్రక్కవాటావాళ్ళు, అద్దె అంతా భరించలేక మూడు గదులలో ముందు గదిని ఎవరికయినా, అద్దెకు యివ్వాలనుకుంటున్నారు. అద్దె విషయం నేను మాట్లాడుతాను. నువ్వు వెంటనే ప్రవేశించు."

సురేఖ నిట్టూర్చి "సరే! మావాళ్లకు దూరమవుతున్నాను. నీకు దగ్గర అవుతున్నాను. ఈశ్వర సంకల్పం యిల్లా వుంది" అన్నది.

"అక్కా! వెంటనే బయటకు వచ్చేస్తే, మీవాళ్లకు నీవు దూరం కావు. దగ్గరే అవుతావు. నీమీద గౌరవం పెరుగుతుంది" అన్నది సరోజిని.

## 16

ముందు గది అద్దె ఇరవై రూపాయలని సరోజిని తేల్చింది. సురేఖ నెల అద్దె అడ్వాన్సుగా యిచ్చివేసింది. ఒకే బల్బు యింత పవరు వున్నది పెట్టుకునేటట్లు, దానికింత అని నెలకు యిచ్చేటట్లుకూడా ఏర్పాటు జరిగింది. సరోజిని ఆ గదిని తాళం పెట్టి, తాళపు చెవ్విని సురేఖకు వెంటనే యిచ్చివేసింది. మరు రోజు స్కూలుకు సెలవు రోజు అయింది.

సురేఖ ఇద్దరు మేనల్లుళ్ళు, ఇద్దరి మేనగోడళ్ల దుస్తుల ఆదె ప్రకారం, రెడీమేడ్ షాపులో వారికి మంచి దుస్తులు కొనేసింది. ఇంటికి వచ్చిన తర్వాత వాటికి పసుపు పెట్టి వాళ్లకు తొడిగేసింది. వాళ్ల ఎగిరి గంతులు వేస్తూ, తల్లికి చూపించారు "మా అత్తయ్య కొంది" అన్నారు.

"ఇవి ఖరీదు గలవే" అనుకొన్నది గంగమ్మ. వాటిని ఒంటిమీద నుండి తీసివేయమని గంగమ్మ అనలేకపోయింది. ఆ దుస్తులు తొడుక్కుంటే తన పిల్లలు తన పిల్లలేనా అన్నంత అందంగా కన్పించారు. తనను మంచి చేసుకోవడానికి, సురేఖ, యీ పని చేసివుంటుందనీ, తాను ఇంకా నిబ్బరంగా వుంటే సురేఖ యింకా లొంగిపోక తప్పదనీ, కొద్ది రోజులలో పూర్తి జీతం యిచ్చే స్థితికి వస్తుందనీ అనుకుంది గంగమ్మ. సురేఖను లొంగతీసుకోవడానికి తాను ఉపయోగిస్తున్న విధానం ఫలప్రదం అవుతున్నందుకు తన తెలివిని తానే మెచ్చుకుంది.

"మీ చెల్లెలు, మేనల్లుళ్ళకూ, మేనగోడళ్లకూ డ్రెస్ కుట్టించిందండోయ్" అని రాజయ్యకు యింటికి రాగానే చెప్పేసింది గంగమ్మ. పిల్లలు యింకా ఆ దుస్తులతోనే గంతులువేస్తున్నారు. "మా అత్తయ్య కుట్టించింది నాన్నా!" అని ధైర్యంగా తండ్రితో చెప్పేశారు, వాళ్ల అమ్మ మెచ్చుకున్న తర్వాత. రాజయ్య తానెప్పుడూ తన పిల్లలకు యింత అందమయిన దుస్తులు కుట్టించలేదు. కుట్టించే శక్తి లేదు. వాటిని తొడుక్కుని పిల్లలు తళతళా మెఱిసిపోతున్నారు. "బాగున్నాయికదూ!" అన్నాడు భార్యతో. "బాగానే, వున్నాయి" అంది గంగమ్మ, ముఖం విప్పారి. మనస్సులో మాత్రం చాలా బాగున్నాయి అనుకుంది.

"సురేఖా! బోలెడు డబ్బు ఖర్చుకదా! తొడుక్కోవడానికి వాళ్లకేవో వుండనే వున్నాయి కదా! ఇంత ఖరీదుగలవి వాళ్ల కిప్పుడు కొనవలసిన అవసరం ఏమి వచ్చిందమ్మా?" అన్నాడు, రాజయ్య.

"అన్నయ్యా! సంసారం అనేది సముద్రం. కెరటాలు లేనప్పుడు, దానిలో స్నానం చేద్దామనుకుంటే, అది జరిగే పని కాదు. కెరటాలు ఎప్పుడూ వుండడమనేదే సముద్రానికి ముఖ్య లక్షణం.

అల్లాగే మనకు డబ్బు ఎప్పుడో వస్తుంది, అప్పుడిల్లాంటి పనులు చేద్దామనుకుంటే, అది జరిగే పని కాదు. మన యిబ్బందులు మనకు యెప్పుడూ వుంటాయి. ఈలోపుగా వీళ్ళు పెద్దవాళ్లయిపోతారు. పిల్లలకు ఎప్పటి ముచ్చట లప్పుడు జరుగాలి. నేనెప్పుడూ వారికి కిమ్మత్తు గల మంచి దుస్తులు కుట్టించలేదు. అందుచేత సంతోషిస్తారని కుట్టించాను."

"కాస్త మాటంటే, ఇంత వేదాంతం వల్లించేదేమిటి? దీనికి తెలివితేటలు పెరిగినట్లున్నాయి. అరిందాగా మాట్లాడుతోంది. అవును! ఒక హైస్కూలులో పని చేస్తోంది! అందులో అనేకమంది వుంటారు. పరస్పర ప్రపంచాలలో కొంత అనుభవం వస్తుంది. తనకు చెల్లెలయినంత మాత్రాన సురేఖ పసిది కాదుకదా!" అనుకున్నాడు రాజయ్య. పైకి యిల్లా అన్నాడు:

"నువ్వు వాత్సల్యంతో కుట్టించినందుకూ, వాళ్ళు సరదాగా తొడుక్కున్నందుకూ నేనేమీ కాదనలేదు. నాకూ సంతోషంగానే వుంది. నాజన్మలో వాళ్ళకి అల్లాంటివి నేను కుట్టించలేదు. కాని యిప్పుడేమి అవసరం వచ్చింది? పండుగా? పబ్బమా? ఎవరిదయినా పుట్టినరోజా?"

"అన్నయ్యా! నేను యీ ఇంట్లోనుండి, సరోజిని వాటా ప్రక్క వున్న అద్దె గదిలోకి వెళ్లిపోతున్నాను. పిల్లలు అత్తయ్య పేరు చెప్పుకు తొడుక్కుని సంతోషిస్తారని, వెళ్లేటప్పుడు ఇవి కుట్టించాను. పండగనికాదు, పబ్బమనికాదు. నేను ఎప్పటినుంచో మీ యింట్లో వుంటున్నాకదా! నా కళ్లయెదుట వాళ్ళు పుట్టారు, నేనుకూడా కొంత, వారిని పెంచానని అనుకుంటున్నాను. వాళ్ళు సంతోషిస్తే నాకు తృప్తి" అన్నది సురేఖ నిబ్బరంగా, అయినా స్వరంలో గాద్గదికం కొంత వుండనే వున్నది.

"ఏమిటి, మా ఇంట్లోనుండి వెళ్లిపోతావా?"

"అవునన్నయ్యా!"

"ఇంత యింట్లో మసలినదానివి, ఒదిగి ఒక అద్దె గదిలో వుండగలవా? అంత కర్మ ఏమి వచ్చిందమ్మా! నాన్న పోయినా, యింకా నేను బ్రదికేవున్నానుగా!"

ఈ మాటలు రాజయ్య చిత్తశుద్ధితోనే మాట్లాడాడు. భార్య సురేఖ ద్రవ్యంకోసం ఏమయినా అనమన్నప్పుడు, తొట్టుబాటువడి భార్య చెప్పినట్లు వ్యవహరించినా, సురేఖ ముఖం చూసి ఆమెతో మాట్లాడేటప్పుడు మెత్తబడిపోయి, చెల్లెలుమీద అన్న ప్రకటించే వాత్సల్యాన్నే ప్రకటిస్తాడు.

"అందుకే నేను సంతోషిస్తున్నాను, అన్నయ్యా! నిన్ను చూస్తే నాకు ఏనుగంతబలం. నువ్వు నాకు పెట్టనికోట మోస్తరుగా రక్షణగా వున్నావు. నీ రక్షణలోనే నేను యింతకాలమూ వున్నాను. ఇప్పుడూ నీ రక్షణలోనే వుంటాను - కాకపోతే ఇంకొకచోట!

నేనేమీ ఊరు విడచికాని, దేశం విడచికాని, పోవడంలేదు. నాన్న పోయినప్పుడు మనింటికి వచ్చిన సరోజిని ప్రక్క వాటాలోనే. వాళ్లకు అడ్వాన్సు యివ్వడం, గది తాళం వేసుకోవడం అయిపోయింది. మంచం కొనుక్కున్నాను. పాత్ర సామానులు కొనుక్కున్నాను గదికి చేర్చుకున్నాను.

నేను అరణ్యవాసానికిగాని, అజ్ఞాతవాసానికిగాని వెళ్లడంలేదు. కానిచోటికి పోవడంలేదు. స్కూలుకు దగ్గరగావున్న చోటికి వెడుతున్నాను. రిక్షా ఖర్చుల కయినది లెక్కవేసుకుంటే, గది అద్దె ఏమంత ఎక్కువకాదు. స్కూలుకు రిక్షాలో వెళ్లనక్కరలేదు. నడచివెళ్ళచ్చు. ఎంతో టయిము కలిసివస్తుంది - స్కూలు పని చేసుకోవడానికి. నిన్ను చూడడానికి నేను వస్తాను. నన్ను చూడడానికి నువ్వు వస్తావు కదా! నేనేమీ మగదిక్కు లేనిదానను కాదు. నాకు నువ్వున్నావు."

రాజయ్య కన్నీటిని పైపంచతో ఒత్తుకుంటున్నాడు. సురేఖకుకూడా, తాను ఎంత మాట్లాడుతూ వున్నా, నాన్న పోయినా నేను బ్రదికేవున్నాను కదమ్మా — అని అనేసరికి కన్నీళ్లు రానే వచ్చినై. కాని స్థైర్యంతో నిలబడింది.

"అన్నదమ్ములకయినా, వెమ్మేళ్లకయినా వేరు తప్పదని — సామెత. నేను వేరే వుంటున్నానని నీవు బాధపడకూడదు. నా గతి యిల్లా పట్టడంచేత, నేను నాన్న దగ్గర వుండవలసిన పరిస్థితులు లేర్పడడంచేత, మన మిద్దరమూ ఒక యింట్లో యిన్నాళ్లు వుండడం సంభవించింది. మనము వేరుకాకపోయినా, మనం వుండవలసిన చోటులు వేరే. ఇంతవరకూ, నువ్వు నన్నేమీ వేరేచోటు చూసుకొమ్మని చెప్పలేదు. అందుకే నేను ఎంతో సంతోషిస్తున్నాను."

"మాటమాత్రం ముందుగా చెప్పకపోయావా, తల్లీ!"

"అన్నయ్యా! చెబితే నువ్వు నన్ను వెళ్లనిస్తావా? అసలు నిన్ను చూస్తూ నే నిక్కడ నుండి వెళ్లగలనా? పుట్టినదగ్గర నుండీ, మనం ఒక్కచోట వున్నాం. ఆ దౌర్బల్యం అడ్డు వస్తుందనే, ముందుగా నీతో చెప్పకుండా, నువ్వు ఏమనుకున్నానరే—అని యీ నిర్ణయం తీసుకున్నాను. క్షమించు అన్నయ్యా నన్ను. పెద్దవాడవు! నీకు ముందుగా చెప్పవలసిన విధి వున్నమాట నిజమే."

రాజయ్య కన్నీరు కారుస్తూ, నిరుత్తరుడయాడు. అతనికి సురేఖ వంటి దేవతలాంటి

వెళ్లెలివి ఇంట్లోనుండి వెళ్లిపొమ్మని చెప్పమన్న తన భార్య మాటలు జ్ఞప్తికి వచ్చినై.

"రోగి పాలే కోరాడు, వైద్యుడూ పాలే కోరాడు" అని సామెత. వెళ్లిపొమ్మని తనను చెప్పమని భార్య ఎప్పుడో చెప్పింది. చెప్పనక్కరలేకుండానే వెళ్లిపోతానని సురేఖ అంటోంది — అనుకున్నాడు. సురేఖకు కూడా దుఃఖం పొంగివచ్చి కళ్లు ఒత్తుకుంది.

గంగమ్మకు మాత్రం ఆ క్షణాలు భరింపరానంత కష్టంగా వున్నయ్. సురేఖ లొంగివస్తుందనీ, ఆమె సొమ్ము తమకు వస్తుందనీ వేసుకున్న అంచనాలు తారుమారయినాయి. తాను పెట్టిన మానసిక హింసకు ఫలితంగా, సురేఖ వెళ్లిపోవడానికి నిశ్చయించుకొన్నందున, నెల నెలా వచ్చే వందేసి రూపాయల వరుమానం 'బంద్' అయిపోతోంది. ఏదో ఒక మూల పెట్టె పెట్టుకుని పడుకునే సురేఖ వల్ల తమకు వచ్చే అద్దె నష్టమేమీ లేదు. జీతమివ్వక్కర లేని 'ఆయా'గా తన పిల్లలకు సంరక్షణం చేసే సౌకర్యం పోయింది. సురేఖ తినే తిండి పిట్ట తిండి. ఉద్యోగం చేసే ఆడపిల్లలు తినే తిండి. అన్నం జీర్ణం కాకా, లావెక్కడం యిష్టంలేకా, వాళ్లు తక్కువ అన్నం తింటారు. వాళ్ల తిండి అంతా కలిపితే, పనిమనిషికి పడవేసే అన్నమంతకూడా వుండదు. ఆ అన్నానికి వచ్చే ప్రతిఫలం ప్రతి నెలా వంద రూపాయలు. ఇకముందు అవి లేవు. సురేఖ గంగమ్మ ఉచ్చులు తెంచుకొని బయటపడిపోతోందనీ, తన భర్త నిస్సహాయ స్థితిలో వున్నాడనీ, ఆమెకు కడుపు మండిపోయింది. అసలు సురేఖ వెడతాననే సరికే పై ప్రాణాలు పయినే పోయినై. బయటకు పంపుదామనే కసిచేత, అవసరమయితే, తాను బయటకు పంపడం వేరు — సురేఖ తనంత తాను వెళ్లిపోతాననడం వేరు — ఫలితం వెళ్లడమే అయినా, ఈ వెళ్లడం, గంగమ్మను ఓడించి వెళ్లడంగా గంగమ్మ భావించింది. భర్త వంక చూసి ఇలా అన్నది :

"ఇన్నేళ్లనుండి వున్న మనిషి, నేను కాపురానికి రాకముందటినుండి కూడా వుంటున్న మనిషి, హఠాత్తుగా చెప్పకుండా, చెయ్యకుండా, ఎందుకు బయలుదేరుతుంది ? మనవల్ల ఏమి బాధ కలిగిందో ! తండ్రి తర్వాత తండ్రి, చెట్టంత అన్నగారు, ఇంట్లో వుంటుంటే, లెక్కచేయకుండా, ధిక్కరించి, వేరే యిల్లు చూసుకొని, వెళ్లిపోతోందీ అంటే, తాను స్వతంత్రంగా వుండాలని, సంకల్పించుకొన్నదన్నమాట !

నాకు తెలిసినంతవరకూ, నేనేమీ ఒత్తిళ్లు పెట్టి, ఈ యింట్లో ఆమె స్వాతంత్ర్యానికి భంగం కలిగించలేదు. ఆమెకు తోచిన పని ఆమె చేస్తూ వుంటే, పోనీలే, కాదనడం దేనికని వూరుకున్నాను. ఫలానా పని చేయమని చెప్పలేదు. ఉద్యోగం చేసే ఆడవాళ్లకు పొట్ట పెరగకుండా శరీర వ్యాయామం చేస్తారని అంటారు. అందుకని ఇంట్లో పని చేస్తోందేమో అనుకున్నాను. శేరు బియ్యం విసరమని నే నెప్పుడూ తిరగలి ముందు పడవేయలేదు.

తల నోటి తప్పు, చెప్పవద్దూ! నే చేసినదల్లా ఏమిటంటే — మీతో ఒక మాట అన్నాను. ఆడది దాచుకోవడమేమిటండీ ! ఆ జీతం రాళ్లేమిటో మీరే ప్రతి నెలా తీసుకోరాదా, అని. అది కాస్త మీరు బయటపెట్టారు. ఇచ్చిందీ లేదు, పెట్టిందీ లేదు, కాని — ఆ డబ్బు మా కివ్వడంలేదని నాకేదో కోపంగా వున్నదని, మనస్సులో పెట్టుకు, మా వదినె నన్ను శిక్షిస్తోంది. దానికయినా యింత శిక్ష ? అసలు నాదేముందీ ! ఆడదాన్ని ! మీరూ మీ పిల్లలూ ! నిజానికి ఆ శిక్ష నాకేమిటి ? ఈ యింటికి యజమాని మీరు !

కన్నతండ్రి పోగానే, ఇంటి ఆడపడుచును, ఇంట్లోనుంచి వెళ్లగొట్టి, వేరే కాచుకు త్రాగమన్నారని, ఊరూ, నాడూ, 'యాగీ' చేయడానికి కాదూ, యిప్పుడీ పని చేసేది ? పాపం, పుణ్యం, పరమాత్ముడు పరిపాలించాలి ! పిల్లలకు చొక్కాలు కుట్టిస్తే ఎందుకో అనుకున్నాను ! అన్నన్న ! ఇందుకన్నమాట !

తాను ఇంట్లోనుంచి వెళ్లిపోదలచుకొని, ఆ గరళం మ్రింగించడానికి ముందు, ఈ చొక్కాలు కుట్టించడం, అనే అమృతం చూపించిందన్నమాట ! పాలసముద్రం చిలికేటప్పుడు ముందు గరళం, తర్వాత అమృతం. ఇక్కడ తారుమారు. నేనేమన్నా చదువుకున్నదానినా ఏమన్నానా ? నల్లనివన్నీ నీళ్లూ, తెల్లనివన్నీ పాలూ, అనుకునేదానిని. నాకేం తెలుస్తాయి. ఈ మాయామర్మాలు !"

గంగమ్మ మాటలలో సారం ఏమిటంటే, సురేఖ యిక్కడ నుండి వెళ్లిపోవడం యిష్టం లేక పోవడం. దీనిని పిల్లలు యింత ఉపన్యాసం అయిన తర్వాత గ్రహించారు.

"వెళ్లవద్దు అత్తయ్యా !" అని వాళ్ళు సురేఖ చుట్టూ మూగారు. పిల్లలు మూగేటప్పటికి సురేఖ కంపించిపోయింది.

"దానికదే మందు" అన్నట్లుగా, గంగమ్మ తలపంకించి పిల్లలవంక చూసింది.

"నేను ఏ ఊరూ వెళ్లడంలేదమ్మా !" అని సురేఖ ప్రతి ఒక్కరినీ బుజ్జగించి ముద్దు పెట్టుకుంది, కన్నీరు కారుస్తూనే.

"నేను వస్తూవాయూ వుంటాగా ! మీరుకూడా వస్తూపోతూ వుండవచ్చు" అని పిల్లల తలలు నిమిరింది. ఆశీఃపురస్సరంగా ఆఘ్రాణించింది. పెట్టె తీసుకుంది

"అన్నయ్యా ! వెళ్లివస్తాను" అంది.

"అమ్మా ! నువ్వు వెళ్లడం నా కిష్టంలేదని నీకు తెలుసు. వెడతానంటున్నావు. నేనేం చెప్పేది? నువ్వేమీ చిన్నపిల్లవుకాదు — రెండు దవడకాయలు వాయించి కూర్చోపెట్టడానికి ! ప్రాజ్ఞురాలవు. ఉద్యోగినివిగా జవాబుదారీకలదానివి. సరే ! ఆ పెట్టె అక్కడ వుంచమ్మా ! మ్రానల్లే యింత మగవాడిని వుండి, ఆడపిల్లచేత పెట్టె మోయిస్తానా తల్లీ !" అన్నాడు రాజయ్య.

సురేఖ పెట్టె అక్కడ పెట్టేసింది.

"ఏమే !" అన్నాడు రాజయ్య గంగమ్మ వంకకు తిరిగి.

ఏమిటన్నట్లుగా చూసింది భార్య.

"మా చెల్లెలికి కాళ్ళకు పసుపుపూసి, ముఖాన బొట్టుపెట్టు !"

గంగమ్మ గునుస్తూ ఆ పని చేసింది.

"పెట్టెలో రవికలగుడ్డ తీసుకువచ్చి పెట్టు."

సురేఖకు మళ్లీ బొట్టుపెట్టి చేతి కిచ్చింది గంగమ్మ.

"గంగమ్మ వదినే ! నేను వెడుతున్నానని నువ్వేమీ అనుకోకు. మన బంధుత్వం దృఢంగా వుండడానికే నేను వెడుతున్నది ఎవ్వరూ నన్ను మీరు వెళ్లగొట్టారని అనరు. వాళ్లకేం పట్టింది ? ఒకవేళ అంటే, వాళ్లతో నేనే వెళ్లిపోయానని చెబుతాను. నామూలంగా మీకేమీ అప్రతిష్ఠ రాదు. ఆడపడుచులందరూ గౌరవంగా వచ్చినట్లే నేనూ మీ ఇంటికి వస్తాను. ఈ ఊళ్ళో వున్న ఆడపడుచును కాబట్టి ఎక్కువసార్లు రావచ్చు — పండుగలకు !" అని నవ్వు తెచ్చుకుని నవ్వింది.

రాజయ్య రెండు రిక్షాలు కేకవేశాడు. సురేఖ వాళ్ళతో ఫలానా చోటుకని బేరమాడింది.

( 32 వ పేజీ చూడండి)



# రష్యాలో కూడా అద్దె యిండ్లున్నాయి !

సోవియట్ యూనియన్‌లో కూడా ఎంతోమంది అద్దె యిండ్లలోనే వుంటున్నారు. కాకపోతే వాళ్ల అదృష్టవంతులు — 50 ఏండ్లగా వుంటున్నా ఒక్క "కోపెక్కు" కూడా 'అద్దె' ఎక్కువ చేయమని యింటి యజమాని కోరలేదు. అంటే అర్ధ శతాబ్దకాలంగా రష్యన్ యిండ్ల అద్దెలు ఒక్కలాగే వున్నాయన్నమాట !

అంతేనా ? ఒక యిల్లుందనుకోండి... అందులో వున్న గదులకి మాత్రమే అద్దె లెక్కగట్టి తీసుకుంటారు తప్ప — వసారాలకి, వంట గదికి, స్నానాల గదికి మొదలైనవాటికి అద్దె అడగరు... యివ్వరు.

ఒక చదరపు మీటర్ గదికి పదమూడు "కోపెక్కులు" పైన కొంచెం చిల్లర చొప్పున అద్దె వుంటుంది. ఇంకో తమాషా... యింట్లో వున్న వంట 'గ్యాసు' — పంపునీళ్ల మొదలైనవాటికి మీటర్లు ఉండవు — నెలకి మనిషికి యింత అని తీసుకుంటారుట. తలసరి రేటు కట్టేస్తే మన యిష్టం ఎంత 'గ్యాస్' ఐనా, ఎన్ని నీళ్లైనా వాడేసుకోవచ్చును. కాకపోతే 'కరెంటు'కి మీటర్ వుంటుంది. దానికి 'బిల్' కట్టాలి.

146 రూబుళ్ల నెలసరి వేతనం వున్న పెద్దమనిషికి 18 నుంచి 20 రూబుల్‌లు చెల్లిస్తే చాలు — అన్ని సౌకర్యాలు వున్న రెండు పడక గదుల యిల్లు అంటే మొత్తంమీద 50 చదరపు మీటర్‌ల వైశాల్యం గల యిల్లు దొరుకుతుంది... [ఐతే చిన్న జోకు. అక్కడ పన్నులు కూడా 50 సం.లుగా స్థిరంగా వున్నాయేమో యిళ్లమీద. అంచేత అద్దెలు పెరగకపోవచ్చునని ఏ యింటి యజమానైనా అనుకోవచ్చును.]




## సినిమా విశేషాలు

### సుశీల పాడిన ఆరు పాటలు

ఈమధ్య వరుసగా సుశీల పాడిన ఆరు పాటలను విన్నాను. ఆరు పాటలను చేసినవారు... వేర్వేరు సంగీత దర్శకులు. ఆరింటికి అభినయం చేసేవారు... వేర్వేరు కథానాయికామణులు.

మహదేవన్ దగ్గర పాడిన పాటకు మంజుల నాయిక. చక్రవర్తి దగ్గర పాడిన పాటకు వాణిశ్రీ నాయిక. చలపతిరావు దగ్గర పాడిన పాటకు జయసుధ నాయిక. జి. కె. వెంకటేష్ దగ్గర పాడిన పాటకు జయప్రద నాయిక. రాఘవులు దగ్గర పాడిన పాటకు జయచిత్ర నాయిక. శంకర్ గణేష్ దగ్గర పాడిన పాటకు ప్రభ నాయిక.

విచిత్ర మేమిటంటే... ఆరుగురికి పాడిన సుశీల... వారే పాడుతున్నారా అన్నంత సహజంగా ఆలాపించింది.

అందుకేనేమో, అందరూ ఆమే పాడా లంటున్నారు.



'ఇంటిని దిద్దిన యిల్లాలు'లో
కమల్‌హసన్, జయసుధ

### హనుమాన్‌ప్రసాద్ రెండో చిత్రం

"దేవుడు చేసిన బొమ్మలు" చిత్రాన్ని బహు జనరంజకంగా రూపొందించిన హనుమాన్‌ప్రసాద్ తన రెండో చిత్రాన్ని (దర్శకుడుగా) జనవరి యిరవై ఆరున ప్రారంభించారు.

ఈ కొత్త చిత్రంలో మురళీమోహన్, దీప, గిరిబాబు, మోహన్‌బాబు, ఈశ్వరరావు, కొమ్మినేని ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

"దేవుడు చేసిన బొమ్మలు" చిత్రం ఆర్థికంగా ఆశించినంత ప్రతిఫలాన్ని యివ్వలేదేమోగాని, చిత్రంగా అందరినీ ఆకర్షించగలిగింది అనెడి అభిప్రాయాన్ని అనేకులు వెల్లడించారు.

ఈ రెండో చిత్రం కమర్షియల్ దృష్టితో తీస్తున్నట్టు, దర్శకుడు హనుమాన్‌ప్రసాద్ చెప్పారు.

# ౩ నెలలప్పుడు పాపకు యిచ్చే ఘన ఆహారం మిగతా జీవితపు స్వరూపాన్ని నిర్ణయిస్తుంది;

## కేవలం పాలుయిస్తే చాలదని డాక్టర్ల అభిప్రాయం



**డాక్టర్లు సిఫార్సు చేస్తారు**

# ఫారెక్స్®

**సంతులిత ఘన ఆహారం**
**త్వరగా సంపూర్ణమైన పెరుగుదలకోసం**



**పాపకు 3 నెలలు వచ్చాయంటే, పెరిగే సమయం మొదలైందన్న మాట.**

పాప శరీరమూ దానితో బాటే మెదడూ పెరగటం ప్రారంభిస్తాయి. అప్పుడు పాలు మాత్రమే యిస్తే చాలదు, అసలు తల్లి పాల నుంచి మార్చే యీ సమయమే ఎదుగుదల సమయం. సున్నిత మైన పాప జీర్ణకోశానికి యింట్లో అందరూ తినే ఆహారాన్ని తిని అరిగించుకునేలాగ చెయ్యాలి. దానికి ఫారెక్స్ యివ్వడం కన్న మించినదిలేదు.

**డాక్టర్లు ఫారెక్స్ యివ్వమని సిఫార్సుచేసే కారణం—**

పెరిగే పాప అవసరాలకు కావలసినది దీనిలో ప్రత్యేకంగా సంతులితం చేయబడటం. ఫారెక్స్‌లో, ఆరోగ్యమైన రక్తమూ, శక్తినీ యిచ్చే యినుము సరియైన ప్రమాణంలో ఉంది— తల్లి పాల నుంచి మార్చేటప్పుడు యిచ్చే ఏ యితర ఆహారంలోనూ యిది యింత సరియైన పద్ధతిలో సంతులితం చేయబడలేదు. ఫారెక్స్‌లో గల కాల్షియం, విటమిన్ డి2 పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టిపళ్ళూ సమకూరుస్తాయి. సరియైన ప్రమాణంలో గల ప్రొటీన్లు, మెదడునూ, శరీరాన్ని త్వరిత గతిలో పెరిగేలా చేస్తాయి. పాప అవసరాలకు కావలసిన శక్తి యిస్తుంది. అందుకే తల్లులు మిగతా వాటికన్న ఫారెక్స్‌నే ఎంచుకుని యిస్తున్నారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

**ఫారెక్స్, తల్లి పాలనుంచి మార్చే సమయంలోని ఆదర్శ ఆహారం**

వివిధ రకాల ఆహారాలతో కలిపినప్పుడు రుచిగా ఉండేది ఒక్క ఫారెక్స్ మాత్రమే. పళ్ళు, కూరగాయలు, పప్పు, మాంసం, గుడ్లు లాంటి అవసరమైన ఆహార పదార్థాలను ఫారెక్స్‌తో కలిపి పాపకు అలవాటు చేయవచ్చును. మీ పాప వీటిని రుచిగా, యింట్లో అందరితో బాటు యిష్టంగా తింటుంది.

**ఫారెక్స్ పుస్తకం కోసం, రూ. 2 తగ్గింపు పథకం కోసం రాయండి...**

మీపేరు, విలాసం (ఏ భాషలో పుస్తకం కావాలో రాయండి), దానితో బాటు 25 పై. స్టాంపులు, పోస్ట్ బ్యాగ్ 19119, బొంబాయి 400 025కి రాయండి.




గ్లాక్సో

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ''రిఫ్లెక్షన్స్'' చిత్రంలో ఉత్తమనటి జేన్స్లిక్‌టోవా ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఆమె నటించిన చిత్రం పేరు ''రిఫ్లెక్షన్స్'' ఈ పేజీలోనే ఛాయాచిత్రం చూడండి. ★★★

## ఢిల్లీలో జరిగిన ఆరవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో పాల్గొన్న చిత్రాలలోని కొన్ని దృశ్యాలు

ఆరవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవం పోటీలో మొత్తం 25 విదేశీ చిత్రాలు పాల్గొన్నాయి. వీటిలో అన్నింటికన్నా ఉత్తమంగా వున్న చిత్రంగా ఒక జపాన్ సినిమాని సత్యజిత్‌రాయ్ ఆధ్వర్యాన వున్న న్యాయనిర్ణేతల సంఘం నిర్ణయించింది. దీనికి ''స్వర్ణమయూరం'' యిచ్చారు. దీని పేరు ''మాన్ అండ్ షన్'' – ఇది ఒక అన్నా చెల్లెళ్ల కథ. చెల్లెలు కాలుజారి తల్లి అవుతుంది అన్న కోప్పడి – గర్భస్రావం చేయించుకోమని పట్టుబడతాడు. కాని ఆ అమ్మాయి ఒప్పుకోదు. తల్లినై తీరుతానంటుంది. పల్లె వదలి పారిపోయి పట్నవాసంలో వ్యభిచారిణిగా మారిపోతుంది. ఈ కథను అత్యద్భుతంగా ఒక నదీతీరాన గల పల్లె వాతావరణంలో తీశారు.

### ఉత్తమ నటి అవార్డు

జ్యారీ హంగేరీ చిత్రంలో నటించిన జేన్స్లిక్‌టోవాకి ఉత్తమ నటిగా ''వెండి నెమలి'' అవార్డు నివ్వాలని తీర్మానించారు.



అర్జెంటీనా చిత్రం ''ప్రైదాలిర్''లో ఒక దృశ్యం

★ ★ ★ 'జడ్జీగారి కోడలు'లో జయప్రద, రామకృష్ణ



[24వ పేజీ నుంచి]

### అడవి రాముడు

సత్యచిత్రవారి సినిమాస్కోప్ వర్ణచిత్రం "అడవి రాముడు" ముదుమలై అడవుల్లో జనవరి పది నుంచి నాన్‌స్టాప్ షూటింగు జరుపుకుంటూంది.

ఈ చిత్రంలో "నటరత్న" కొత్తతరహా పాత్రను పోషించ, జయప్రద నాయికగా, జయసుధ, శ్రీధర్, జగ్గయ్య, గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, రమాప్రభ, కవిత సహపాత్రధారులుగా నటిస్తున్నారు.

భీకర... భయంకర జంతువులు "అడవి రాముడు" ధాటికి ఆగలేక, ఆయన స్నేహాన్ని కోరే విచిత్ర సంఘటనలు ఎన్నో వున్నాయి సత్యచిత్రవారి స్కోప్ చిత్రంలో.

"అడవి రాముడు" చిత్రానికి మహదేవన్, విన్సెంట్, జంధ్యాల, వేటూరి, పట్నాభి వరుసగా సంగీతాన్ని, ఛాయాగ్రహణాన్ని, సంభాషణ, పాటలను, ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

శ్రీ సత్యనారాయణ... సూర్యనారాయణ నిర్మిస్తున్న యీ స్కోప్ కలర్ చిత్రానికి కె. రాఘవేంద్రరావు దర్శకుడు.

### లెనిన్‌బాబు చిత్రంలో చిత్ర

రవీంద్రా ఆర్ట్స్ ఎంటర్‌ప్రైజస్ తలపెట్టిన సాంఘిక చిత్రంలో జయచిత్ర నాయికగా, రంగనాథ్ నాయకుడుగా, అల్లు రామలింగయ్య విదూషకుడుగా నటించగలరన్న వార్తను, తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారు చెప్పారు.

హైదరాబాదులో జరిగే యీ చిత్రానికి వీరభద్రశాస్త్రి కథను, పినిశెట్టి మాటలను, చలపతిరావు సంగీతాన్ని సమకూర్చగలరని, వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయాగ్రాహకులని, నిర్మాత వి. రాధాకృష్ణారావుగారు నిర్ణయించారు.

యువకుల్లో గట్టివాడు, సరుకున్నవాడు లెనిన్‌బాబు యీ చిత్రానికి దర్శకుడు.



* * * * * * చైనా చిత్రం "తెల్ల జుట్టమ్మాయి"లో ఒక దృశ్యం * * * * * *





* * * * * * 'మనవడికోసం'లో విధుబాల, రోజారమణి * * *



'సావాసగాళ్ళు'లో రమాప్రభ, నాగేష్

### జయసుధ చిత్రనాయకులు

1975 సెప్టెంబరు నుంచి 1976 డిశంబరు వరకు గడచిన మాసాలు ఎన్ని. పదహారు మాసాలు. ఈ పదహారు మాసాలలో "లక్ష్మణరేఖ" చిత్ర నాయిక సాధించిన విజయాలు అనితర సాధ్యములు.

వ్యాంపుగా స్థిరపడగలదని వూహించినజయసుధ యీ రోజు ఒక అగ్రశ్రేణి నటిగా రూపొందడానికి కనిపించే కారణం ఒకటుంది.అదేమిటన :

"లక్ష్మణరేఖ"లో నాయిక వేషం రావడం. ఆ చిత్ర దర్శకుడు గోపాలకృష్ణ జయసుధ చేత బాగా చేయించడం.

1975 సెప్టెంబరులో "లక్ష్మణరేఖ" విడుదలయిన తర్వాతనే, జయసుధకు"స్టార్‌డమ్"వచ్చింది.

జయసుధ అందరికన్నా ఎక్కువ చిత్రాలలో నటిస్తున్నమాటకూడా నిజమే.

ఆమె నటిస్తున్న చిత్రాలు, ఆ చిత్రాల నాయకులు ఎవరు అన్న నిజాన్ని పాఠకులకు తెలుపుతున్నాను.

## సినిమా

"ముత్యాల పల్లకి" : నిర్మాత : ఎమ్. ఎస్. రెడ్డి. దర్శకుడు : బి. వి. ప్రసాద్. కథానాయకుడు: నారాయణరావు.

"సీతమ్మ సంతానం" : నిర్మాత : మురళీకృష్ణ.దర్శకుడు. కె.ఎస్.రెడ్డి. నాయకుడు:చలం.

"ప్రేమలేఖలు" : నిర్మాత : డి. మధుసూదనరావు. దర్శకుడు : రాఘవేంద్రరావు. నాయకుడు : మురళీమోహన్.

"ఇదెక్కడి న్యాయం" : నిర్మాత : జగదీష్ చంద్రప్రసాద్. దర్శకుడు : దాసరి నారాయణరావు. నాయకుడు : నరసింహరాజు.

అనిల్ ప్రొడక్షన్స్ : నిర్మాత : లక్ష్మీపతి ప్రసాద్. దర్శకుడు : టి. ఎల్. వి. ప్రసాద్. నాయకుడు : రామకృష్ణ.

"ఓ మనిషీ తిరిగిచూడు" : నిర్మాత : విష్ణు శ్రీహరిరావు. దర్శకుడు : దాసరి నారాయణరావు. నాయకుడు : మురళీమోహన్.

'ఈనాటి బంధం ఏనాటిదో'లో ఒక దృశ్యం

ఇవిగాక డి. వి. ఎస్. ప్రొడక్షన్స్, సమత ఆర్ట్స్ వారి "మల్లెపూవు", మారుతీ కంబైన్స్ వారి "జీవనరాగం", సత్య చిత్ర వారి "అడవి రాముడు", ఇందిరా మూవీస్ వారి "అమానుష్" చిత్రాలలో జయసుధ ఉపనాయికగా పాత్రపోషణ చేస్తూవుంది.

### క్రాంతికుమార్ కొత్త చిత్రం

క్లాస్ చిత్రాలను మాస్‌కూడా మెచ్చేవిధంగా రూపొందించే విషయంలో నిర్మాత క్రాంతికుమార్ విజయం సాధిస్తూనే వస్తున్నారు.

త్వరలో ఆయన నిర్మించిన "కల్పన" విడుదల అవుతుంది. ఏప్రిల్ నుంచి క్రాంతికుమార్ తన కొత్త చిత్రాన్ని ప్రారంభిస్తారు.

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో తయారు కానున్న క్రాంతికుమార్ కొత్త చిత్రంలో మురళీ మోహన్...జయసుధప్రధానపాత్రలను పోషించగలరు.

పిక్చర్ "పబ్లిసిటీ"లో క్రాంతిగారు ఎప్పుడూ ముందడుగు వేస్తూనేవున్నారు.

### విజయలలిత విజృంభణ

పరిశ్రమ కొక స్వీటు న్యూస్‌ను, ప్రజల కొక ఆనంద వార్తను యీ కొత్త సంవత్సరంలో యివ్వడానికి ముందుకొచ్చింది, విజయలలిత.

ఏకైక వ్యాంపు నటిగా, ఏళ్లిగా ప్రజలను ఆకర్షించిన విజయలలిత విధి చేసిన వంచనకు లొంగి, ఎన్నో చిత్రాలను చేతులారా వదిలేసింది.

హీరోయిన్ పాత్రలను మాత్రమే చేస్తాను అని ఆమె అన్నదని ప్రచారం ప్రారంభమైన ప్రతిఫలంగా, ఆమెను వాంప్ వేషాలకు ఎవ్వరూ అడిగేరు కారు.

ఈ సంవత్సరం ఆరంభ రోజున, విజయలలితను ఆవిడ యింట కలిశాను. అప్పుడామె నీలిరంగు పట్టుచీరె... అదే రంగు బ్లవుజ్ ధరించి మిలమిల మెరిసింది. మేమిద్దరం అనేక విషయాలను చర్చించాము. చివరకు నా సలహాను ఆమె ఆమోదించింది.

"ఇకపై వాంప్ వేషాలను వద్దనను. నృత్య సన్నివేశంలో కూడా (సోలో డ్యాన్సు) పాల్గొని నటిస్తాను. హీరోయిన్ అయితేనే చేస్తాను అని నే నెప్పుడూ ఎక్కడా అనలేదు" అంది నాలుగన్నుల విజయవనిత.

### నాలుగు భాషల నటి

నెలకు యిరవై రోజులు మదరాసులో వుండడం లేదని విన్నాను. నిజమేనా, అని ప్రశ్నించాను.

అవును. కర్నాటకం... కేరళం... తమిళం... ఆంధ్రం వెళ్లడంవల్ల తక్కువ రోజులు చెన్నపురిలో వుంటున్నాను, అంది అందాల అతివ.

ప్రస్తుతం విజయలలిత కన్నడంలో మూడు చిత్రాలు, మలయాళంలో మూడు చిత్రాలు, తమిళంలో ఒకటి నటిస్తున్నట్టు చెప్పింది. మరి, తెలుగులో ఎన్ని అని అడిగాను.

సృజనా కంబైన్స్‌వారి "తొలిరేయి గడిచింది", ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "ఆలుమగలు", సుగుణా పిక్చర్స్‌వారి "సన్యాసి రాజా", ఆదుర్తి ఆర్ట్స్‌వారి కొత్త చిత్రం.

విజయలలిత విసిరే చూపులకు ప్రేక్షకులు పుష్పించిన ఆనందాన్ని అనుభవించేవాళ్లు. ఆమె వాల్గనుల వీక్షణాలను మన్మథబాణాలు అనక తప్పదు.



నాతో గొడవ పడిన రోజు ఆయన ఇలాంటి చిత్రాలే గీస్తారమ్మా!!




రాక్షసి
దెయ్యం
శూర్పణఖ




రాగతి పండరి






నీ వర్కు నేను బాగా మెచ్చుకుంటాన్నోయ్! కానీ పాటలు పాడుతూ పైటెం మాత్రం బాలేదు.
అందుకని...!
శ్రీనివాస్








మొన్న మీ కోడలు వచ్చినప్పుడు సామాను తెచ్చుకోలేదని వెళ్ళగొట్టావుగా – అత్తగారు పండక్కి రమ్మనమని కబురు పెట్టారు. మరి నేను తీసుకెళ్ళకరలేదా!
అమ్మా,

'బంగారక్క'లో ఒక సన్నివేశం

# సినిమా

## రెబల్‌స్టార్ రెజిమ్

"కురుక్షేత్రము" చిత్రం కర్ణ పాత్రధారికి చేసిన మంచి చెప్పనలవికానిది. కృష్ణంరాజు ఏమిటి? కర్ణుడేమిటి? అని పరిహసించిన పెద్దలు, సందేహాన్ని వెలిబుచ్చిన ప్రజలు "కురుక్షేత్రము" విడుదలానంతరం అన్న మాటలు: కర్ణుడుగా కృష్ణంరాజు హైట్సుకు వెళ్లారని, కుంతీదేవికి అభయమొసగిన ఘట్టంలో, అంతిమ ఘడియల్లో, దేవేంద్రుడికి దానమొసగు ఘట్టంలో కృష్ణంరాజు అనూహ్యంగా నటించారని ప్రేక్షకులు ఏకకంఠంతో అంగీకరించారు.

ఇప్పుడు కృష్ణంరాజు నటుడుగా యెంతో పెరిగాడు. "రెబల్‌స్టార్" రెజిమ్ ప్రారంభమయినట్లే.

## ధైర్యే...సాహసే...లక్ష్మి

"కృష్ణవేణి, భక్తకన్నప్ప" వంటి మాణిక్యాలను సృష్టించగలిగిన "రెబల్‌స్టార్" యీసారి మరో మహత్తరమైన యజ్ఞాన్ని తలపెట్టారు.

చిత్రానికి "ధైర్యే ... సాహసే ... లక్ష్మి" అని పేరిడబోతున్నట్టు, చిత్రానువాదం వ్రాస్తున్న భీమేశ్వరరావు చెప్పారు.

అగ్రెసివ్‌గా వుండే కథానాయకుడుగా కృష్ణంరాజు నటిస్తున్న "ధైర్యే... సాహసే... లక్ష్మి" వర్ణ చిత్రానికి బాక్సాఫీస్ దర్శకుడు సారథిగా వ్యవహరించగలరని, నిర్మాత సూర్యనారాయణరాజు చెప్పారు.

1977 లో రెండు చిత్రాలను అందించే ఉద్దేశ్యం గోపీకృష్ణా మూవీస్‌కు వుంది.

(34 వ పేజీ చూడండి)

'అత్తవారిల్లు'లో ఒక దృశ్యం



# నాకూ కథలే ఇష్టం

బి.యస్.కె. సోమయాజులు

ఆఫీసునించి వచ్చిన మూర్తి తన వాటాలోకి వెళ్లబోతున్నవాడల్లా, పక్క వాటావాళ్ల తలుపు తీసేవుండటం చూసి అటు వెళ్లాడు. అతను రావడం అంత దూరంనించే గమనించిన సుజాత అతని పేర్న వచ్చిన టెలిగ్రాం టేబిలు సొరుగు లోంచి తీసివుంచింది.

రోజూలాగే గది గుమ్మం దగ్గర తచ్చాడుతున్నట్టు డోర్ కర్టెన్ కిందనించి కన్పిస్తున్న అతని జోళ్లు చెబుతున్నాయి. ఏమిటో, ఈ మనిషి ఆఫీసు నించి వచ్చి గది తలుపు తీసుకుని పెరట్లోకి వెళ్లి మొహమూ కాళ్లూ కడుక్కొని కాస్త రిఫ్రెష్ అయి రాకూడదూ, వచ్చిన ఉత్తరాలు ఆ కాసేపట్లోనే మాయమైపోతాయా అనుకుంటుంది, సుజాత.

ఓసారి వచ్చిన ఉత్తరాలు అందిస్తూ అదే అడిగేసింది కూడాను.

'అమ్మమ్మ, ముందు వుత్తరం చూస్తేగాని అసలు రిఫ్రెష్ అవబుద్ధవదండి—' అన్నాడు అందుకుంటూ.

ఏమిటో, ఆ విరహం —

'ఈ మగాళ్లు బలే తమాషాగా వుంటారు. పెళ్లాం దగ్గర లేనంతసేపే ఈ విరహం. దగ్గరుంటే విలువ ఇవ్వనేయివ్వరు !' అనుకుంటూ,

'ఇదిగో మీ కివాళ టెలిగ్రాం వచ్చిందండీ—' అంటూ అందించింది.

'టెలిగ్రాం' అన్న శబ్దం సహజంగా కలిగించే "భరాకి విరుగుడు కూడా వెంటనే వేసింది. 'అబ్బే, మరేం లేదు; రేపు ఉదయం గోదావరి బండిలో మీ శ్రీమతిగారు వస్తున్నారు—' అని సందేశం వివరించింది.

'అమ్మయ్య, అదా...' మనిషి అంతలోనే మామూలయి, టెలిగ్రాం కాగితం మడత విప్పతూ తన గదికేసి వెళ్లాడు, మూర్తి.

* * *

ఉదయం ఐదు గంటలకే అలారం చప్పుడుకి లేచి హుషారుగా చన్నీళ్ల స్నానం ముగించి, మిల్క్ బూత్‌కి వెళ్లి పాలు తెచ్చి, కాఫీ కాచి, పెద్ద ఫ్లాస్కులో పోసి మిగిలింది తను తాగి, ట్రిమ్‌గా తయారై అరగంటలో స్టేషన్‌కు చేరుకున్నాడు, మూర్తి.

నెలా పదిహేను రోజుల తరవాత మొదటిసారిగా భార్య శ్యామల ముఖం చూస్తుంటే మూర్తికి ఉద్వేగం దాగటంలేదు. రైలు పెట్టెలోంచి దిగుతున్న ఆమెను అమాంతం వెళ్లి గుండెలకు హత్తుకోవాలనే కోరికను అతి కష్టంమీద ఆపుకొని దగ్గరకి వెళ్లి చెయ్యి అందించాడు సాయం చేస్తున్నట్టు.

అయితే శ్యామల ముఖంలో అతను ఆశించిన ప్రసన్నతగాని మరేవిధమైన భావంగాని కనిపించలేదు.

'ప్రయాణం సుఖంగా లేదేమో—' అని సర్ది చెప్పుకుని సూట్కేసు అందుకున్నాడు.

ఇద్దరూ ప్లాట్‌ఫాం బయటికి వచ్చి నిలబడ్డారు.

"ఏమి, అలా వున్నావ్ ?"

"... ... ... ..."

"బెర్త్ దొరికిందా"

"వూఁ"

ఆమె వుదాసీనత అంత స్పష్టంగా కనిపిస్తుంటే తను మరి ముందుకు సాగలేకపోయాడు.

దగ్గరగా వచ్చి ఆగిన ఆటోలో కూర్చుని ఇంటికి వచ్చారు.

,ఆమె పెరట్లోకి వెళ్లివచ్చింది. అతను ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులోకి వొంచి యిస్తూ పక్కనే కూర్చున్నాడు.

గ్లాసు అందుకుని వేడిగా అతనివేపు ఓసారి చూసి, లేచి టేబిలు దగ్గర కుర్చీలో కూచుంది. తీరుబడిగా కాఫీ తాగింది.

"శ్యామూ !" నెలన్నర విరహాన్నీ ఆ రెండక్షరాల్లోనూ యిమిడ్చి పలికాడు. లేచి దగ్గరకి రాబోయాడు.

"అక్కడ, అక్కడ... కూచోండి" టేబిలుమీద ఖాళీ గ్లాసు వుంచుతూ అన్నది. మొహంలోకి వ్యవహారపు కళని తెచ్చుకుంటూ —

అతను ఆమె ముఖం అట్టే చూసి నిల్చున్నవాడు అలానే కూర్చుండిపోయాడు.

"ఇది చెప్పండి — మీ మనసులోని అరల్లో ఎంతమంది ఆడవాళ్లున్నారు ?"

పురుమూ మెరుపూ లేకుండా వొక్కసారి వర్షం వచ్చినట్టు ఫీలయ్యాడు ఆమె ప్రశ్నకి. 'ఠా'రెత్తిపోయినట్టు మొహం పెట్టాడు. 'బేర్' మని ఏడవడమే తరవాయి.

"నా తరఫు బంధువులకి — అందులోనూ, పెళ్లిలో యాదాలాపంగా కలిసే ఎవరికో — నన్నడక్కుండా వుత్తరాలు రాస్తారా — ఏమంత అవసరం వొచ్చిందీ ?"

ఆమె స్వరంలో కనిపించిన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని చూసి అతను ముద్దాయిలాగే ఫీలయ్యాడు.

"నేనెప్పుడు ఎవరికి రాశానని—" మూర్తి స్వరం నూతిలోంచి వస్తున్నట్టే వుంది.

"ఎవరికో గుర్తు తెచ్చుకోండి — 'మీ స్నేహం, బంధుప్రేమ నన్ను అదేదో అంబుధిలో ముంచింది — మీరు ఫామిలీతో తప్పకుండా మా వూరు రండి — చి. సౌ. సరోజ చెప్పింది మీరు బెంగుళూరు వచ్చే నెలలో వెళ్లాలని. ఆ ప్రయాణం నిశ్చయమైతే మా వూళ్లో వోసారి దిగండి—' అంటూ యిదిగో, మీ ఉత్తరం" అంటూ అతని వొళ్లోకి గిరాటేసింది.

వొళ్లోంచి కిందపడిన కవర్ను వొంగి తీసుకుంటూ "ఇదా — రామేశంకి రాశాను — దీన్లో ఏమి వుందని యింత అడావుడి ?" అన్నాడు.

"మామూలుగా చూసేవాళ్లకి మీ మొహంలాగే చాలా అమాయకంగా కనబడుతుంది — కాని ఆ రామేశం ఎలాంటివాడో మీకేం తెల్సు. వొట్టి అనుమానమ్మనిషి. ఎన్నెన్ని మాటలన్నాడో — నలుగుర్లోనూ చచ్చినంత పనైంది నాకు. అసలు మీరు ఆ అమ్మాయి పేరు రాసివుండకపోతే యింత గొడవ వుండకపోను —

"అసలెలా మొదలెట్టాడో తెలుసా 'అయిలే శ్యామలా మీ ఆయనకి వూళ్లో ఆడవాళ్ల పేర్లు బాగానే గుర్తుంటాయిలా వుందే—' అన్నాడు, నలుగుర్లోనూ కూచుని. ఏం ముంచుకొస్తోందిరా భగవంతుడా అనుకున్నాను. అలా తీరుబడిగా కామెంట్ మొదలుపెట్టినవాడు స్టెప్ బై స్టెప్ క్లైమాక్సు పెంచుకుంటూపోయి నానా యాగీ చేసి — నా తల ఎత్తనివ్వకుండా చేశాడు. ఇంతకీ మీకేమంత మునిగిపోయిందండీ, ఆ దిక్కుమాలిన వుత్తరం రాసేవరకూ ?"

మూర్తి అప్రతిభుడైపోయాడు. మునిగిపోవడం ఏమిటీ — పెళ్లిలో స్నేహం అయింది. ఎప్పుడైనా మా వూరు మీదుగా వెళ్తే పనుంటే ఓసారి దిగండి అన్నాడు. దీనికింత పంచాయితీ ఏమిటి ? మనసులో ఘర్షణ మొదలై మౌనంగా వుండిపోయాడు.

ఆమె చెప్పకుపోతోంది :

"ఆ తరవాత వూహలూ అంచనాలూ వొదల్డం మొదలెట్టాడు. నలుగుర్లోకీ పెళ్లాన్ని యీడుస్తున్న జ్ఞానమైనా లేకుండా — పెళ్లి భోజనాల్లో మీరు, ఆమె వొడ్డన్నట — ఓ పోటీలు పడ్డంకాదుట — ఓ ఆప్యాయతలు కావుట — ఔనండీ — నేను చూడనే లేదు, ఆ కొద్ది సేపట్లో అంతలా ఎలా కలిసిపోయారండీ ?"

"మతి లేకపోతేసరి ! వూహలకి అర్థం పర్థం వుండాలి. ఆమె ఎవరు నేనెవరు — ఏదో సామెత చెప్పినట్టుంది—"

"ఏది, ఏది... నావేపు చూసి అనండి, ఆ మాటలు — 'ఆమె ఎవరు — నేనెవరు—' ఏమండోయ్, ఈ విషయాల్లో ఆడవాళ్లకుండే పకడ్బందీతనం మీకు అలవడదండీ — మీకంటే ఆ సరోజే నయం —" అని వొదిలి అతని ముఖంకేసి చూసింది.

అది ఎటో తిరిగివుంది. అటు పక్కకి వెళ్లి చూస్తే "దొరికిపోయాను" అని స్పష్టంగా కనిపిస్తుంది. ఆ భావాన్నితుడిచేసుకొని ఇటు తిరిగిఅన్నాడు:

"ఏదో ఆ కాసేపు పరిచయమూ వాళ్లంటే అభిమానం ఏర్పడిన మాట నిజం — ఇంటికి రాగానే ఆ వుత్తరం రాసి అప్పుడే మరిచిపోయాను. ఆ మాత్రందాని కింత గొడవ చేస్తాడా — హుఁ; మనుషులింత ప్రిమిటివ్‌గా వుంటారా —"

"అలాగే ఆలోచించకూడదు. ఓ పక్క మీ బలహీనతని వొప్పుకుంటూనే అవతలవాళ్లని ప్రిమిటివ్ అంటున్నారు. మీ బలహీనతను బహిర్గతం చెయ్యకుండా నిగ్రహించుకోలేని ప్రిమిటివిటీలో మీరు వుంటూ — అవతలవాళ్లని అనుకోడం ఏం బాగులేదు. ఏమయినా ఇటువంటి విషయాల్లో కొంచెం జాగ్రత్తగా వుండాలి, మీరు. మనుషుల్ని చదవడం, అర్థం చేసుకోడంతోబాటు పరిస్థితికి అనుగుణంగా కామన్‌సెన్సు అంటారే — దాన్నికూడా కొంచెం కొంచెం వాడుతూవుంటే సగం అనర్థాలు తప్పతాయి —"

## నాకూ కధలే ఇష్టం

ఎనిమిదో క్లాసు ఫెయిలైన తనకు పెళ్లాంగా వచ్చిన శ్యామల జ్ఞానం ముందు బుద్ధిగా తల వొంచాడు, ఎమ్మే సైకాలజీతో పాసయిన మూర్తి.

* * *

"వూఁ ఏమిటి సంగతులు — ఇక్కడ కధ ఎలా వుంది — ఏమైనా సంచలనం...' ఆ రాత్రి తమలపాకులు ఏలక్కాయలో సహా నములుతూ మూర్తి పక్కనే సర్దుకుంటూ కబుర్లలోకి దిగింది, శ్యామల.

"నీ వుద్దేశం ఏమిటి — సంచలనం పుట్టించడమే నా పని అనుకుంటున్నావా—" వుదాసీనంగానే అన్నాడు, గోడవేపు తిరుగుతూ —

"ఇటు, ఈ పక్క గోడమీదికి వేస్తున్నారు యివాళ సినిమా యిలా తిరగండి సామీ —" అంటూ పక్కల్లో కితకితలు పెట్టడం మొదలెట్టింది.

"ఛ — ఏంటది — నాకేం బాగులేదు, బుద్ధిగా పడుకో" కొంచెం సీరియస్‌గానే అన్నాడు —

"నడేలెండి—ఈ బాగులేకపోవడాలు నాదగ్గ రా- ముందిటు తిరగండీ, చెబుతా —!"

ఆమె నోట్లోంచి మత్తుగా వస్తున్న ఏలకుల తాంబూలం వాసన అతన్ని మెల్లిగా దార్లోకి తెస్తోంది. తాంబూలంమీద ఎవరో కవి శ్లోకం జ్ఞప్తికొచ్చి నవ్వుకున్నాడు. అనుకోకుండానే ఆమెవేపు తిరిగిపోయాడు.

"ఏదీ, కొంచెం నవ్వండి, ఆఁ అలా - వెనకటికి మీలాంటిదే ఒకామె మొగుణ్ని కొట్టి మొగసాల కెక్కిందట — అలా వుంది మీ సంగతి — అడ్డదిడ్డంగా వుత్తరాలు అయినవాళ్లకీ కానివాళ్లకీ రాయడం "నాకేం బావులే దంటూ నన్నల్లరి పెట్టడవూనా — అందులోనూ నలభై ఆర్రోజుల తరవాత వచ్చిన మొదటి రాత్రి —' అంటూ ఆమె కీలెరిగి వాత పెట్టినట్టు సుతారంగా బుజ్జగిస్తుంటే అప్పటికే ఆమె చేతిలో మరమనిషే అయ్యాడు.

* * *

ఆ మర్నాడు వుదయం మూర్తి మళ్లా మూడ్‌లోకి జారిపోయాడు.

ఎంత ప్రయత్నించీ అతను మరిచిపోలేకుండా వున్నాడు, శ్యామల వర్ణించి చూపిన దృశ్యాన్ని-

---

అన్నాచెల్లెలు బయలుదేరి గమ్యస్థానానికి వెళ్లిపోయారు. సురేఖనూ, సురేఖ అన్ననూ, సరోజినిపలుకరించింది. శేషయ్యకూడాపలుకరించాడు.

"అన్నయ్యా! నేను వంట చేస్తాను. భోజనంచేసి వెళ్లు. అల్లా వెళ్ళకపోతే నేను చచ్చినంత ఒట్టు" అన్నది సురేఖ.

వంట చేసింది. రాజయ్య భోజనం చేసి వెడుతూవుంటే, "నేను నీ యింట్లోనే వున్నాననుకో అన్నయ్యా! వస్తూపోతూవుండు. నువ్వు తప్ప యీ ఊళ్ళో రక్తబంధువు లెవరున్నారు ? నేనేమయినా తప్పచేసివుంటే క్షమించు" అని కాళ్లమీద పడింది. రాజయ్య లేవతీసి "నీదేమీ తప్పులేదమ్మా! ఏదయినా వుంటే అది మాదే" అని తల వంచుకొని కన్నీళ్లతో వెళ్లిపోయాడు.

ఇంటికి వెళ్లగానే గంగమ్మ అడిగింది.

"చెల్లెలిని క్రొత్త యింటికి సాగనంపి వచ్చారా ?" అని.

రాజయ్య మాట్లాడలేదు.

"ఇంతకీ, మగవాడే! వెళ్లవద్దంటున్నాడే! ఎందుకంటున్నాడో విందాం అనే లక్ష్యం వుంటేగా ! ఉద్యోగంచేస్తూ నాలుగురాళ్లు సంపాదించగానే స్వతంత్రురాలయిపోయింది ! స్వయం రాజా ! స్వయం మంత్రీ ! అటు మొగుడుతో సంబంధం లేదు — ఇటు అన్నగారితో సంబంధం తెంపేసుకుంది. ఇష్టారాజ్యం! స్వేచ్ఛ! ఆడింది ఆట! పాడిందిపాట!"

రాజయ్య మాట్లాడలేదు.

"కడుపులో లేనిది కౌగలించుకుంటే వస్తుందా ? అన్నగారిమీద ఆపేక్ష లేదు. ఈయన ఎంత పూసుకుంటే ఏమి లాభం ? మన దీపం అని

## మగదిక్కు

(23 వ పేజీ తరువాయి)

ముద్దుపెట్టుకుంటే మూతిమీసాలుతెగగాలియినట!"

రాజయ్య మాట్లాడలేదు.

"అసలు ఆ మనిషి ఏం చేస్తోందో చూసి కనిపెట్టేవారుకూడా లేరు. ఇంటికి ఆలస్యంగా వచ్చావేం, అంటే, ఆరోజున ఏదో చెప్పి సర్దుకుంది.

అసలు అప్పటినుండే మనస్సులో వుండి వుంటుంది, ఎల్లాగయినా ఇక్కడినుండి లేవాలని. ఇంతట్లో తండ్రి చావు వచ్చింది. ఆ సరోజినీ టీచరు ఆ రోజునే వచ్చి, ఈవిడ ఒక పుంజం వేసుకుంటే ఆవిడ నాలుగు పుంజాలు వేసుకొని, ఏడవడం ప్రారంభించింది.

ఈ యిద్దరి స్నేహం ఏ విధమయి

రామేశం తన ఉత్తరం మీద అందరి ముందూ రేపిన దుమారం — పూరికే దానిగురించే ఆలోచన —

కాఫీ తీసుకొచ్చిన శ్యామలకు నిన్నటి అతని 'ముద్దాయి ముఖం' జ్ఞాపకానికొచ్చింది, అతన్ని చూసి.

"సారీ సర్!" కాఫీ అందిస్తూ అంది, శ్యామల— "మీరింకా దానిగురించే ఆలోచిస్తున్నారులా వుంది!"

"నేను చేసింది పొరపాటే శ్యామూ! అలా ఉత్తరం రాసి వుండకూడ దనిపిస్తుంది — కాని ఆ కొద్దిసేపట్లో వాళ్లంటే నాకు కలిగిన ఫీలింగు— నువ్వు బలహీనతే అంటావో, మరేమంటావో— వాళ్లతో స్నేహం పెంచుకోవాలనిపించింది."

'వాళ్లు'—'వాళ్లతో' ఈ మాటల్లో 'సరోజ'ను అన్వయించుకుంటూ వింటోంది, శ్యామల.

"కాని వొక సంగతండీ, గురూగారూ! మనలో కొన్ని కొన్ని ఫీలింగ్సు — పువ్వులంత సుకుమారంగా పుదయించి మన మనస్సు అనే నందనవనంలో అమాయికంగా నవ్వుతూంటాయండీ — వాటిని మనం, నిజంగా పువ్వుల మాదిరే చూసుకోవాలి — అప్పుడే అవి నిత్య పారిజాతాలుగా వుంటాయి. నిజం పువ్వులు ఒక్క రోజులో వాడిపోతాయా, అవి అలా కాదు, ఈ బాహ్య ప్రపంచంలోకి, ఈ మురికిలోకి మనం తీసుకురానంతసేపూ ఒక రేకు కూడా వాడదు, సరికదా, రోజ రోజూ అందంగా వుంటాయి. అది గుర్తుంచుకోండి. ముందు కాఫీ తాగండి — మీరేం చెప్పొద్దు, నేనే చెబుతా అన్నీ..."

అతను యాంత్రికంగా కాఫీ సిప్ చేస్తున్నాడు.

"సరోజ మీ కిదివరకే తెలుసటగా — బెస్టు ఫ్రెండు, బెస్టు ఫ్రెండు అని పూరికే నన్ను పుబ్బేశారుగాని, ఈ సంగతి నాకెప్పుడన్నా చెప్పారా?— అంతేలెండి — ఎంత బెస్టు ఫ్రెండైనా పెళ్లాం పాత్ర అదనంగా పోషిస్తున్న మనిషికి చెప్పకూడని స్వీట్ సీక్రెట్స్ కొన్ని వుంటాయికాబోలు —

'మీరు వెళ్లాక సరోజ నాతో వొకటే గొడవ — మీ ఆయనెంత మంచివారే—నువ్వెంత భాగ్యశాలివే— అంటూ పుస్తకాల్లోని మాటలు వల్లిస్తూంటే హోల్డాన్ చెప్పి 'ఏంటే కథ?' అని నిల్దీసి అడిగా. వ్రైరిపీనిగ — ఏడిచినంత పని చేసింది. మెల్లి మెల్లిగా వొకటే వొకటీ బయటపెట్టింది.

'మీరు భీమ్లిలో పనిచేసిన రోజుల్లో — అదే మన పెళ్లికి చాలా పూర్వం — వాళ్ల పక్కింట్లోనే వుండేవారట — మీ యింటివాళ్లు మీకూ, సరోజ వాళ్లకూ కామన్ రిలేషన్సుట — ఆ రోజుల సంగతులన్నీ చెప్పిందిలెండి!"

అతని ముఖంలో గతుక్కుమన్న భావాన్ని స్పష్టంగా చదివి — అదేం పట్టనట్టు కొనసాగించింది:

"రోజూ భీమ్లీ బీచి షికార్లు — మూడుమైళ్ళ దూరంలో వున్న చిట్టివలస జంక్షన్ సినిమా హాలుకి 'ప్రేమలేఖలు' సినిమా కెళ్లడం — తిరిగి మూడు మైళ్ళూ నడుచుకుంటూ ఆఖరు పాటలు పాడుకుంటూ రావడం—

"ఏకాంతములైన సాయంత్రాల్లో — ఎదల్లో ఒకరికోసం వొకరు వేగిపోవడాలూ -

"ఉంటాయిలెండి కథలు — అందులో తప్పూ లేదు, అసహజమూ లేదు. అసలు పాతిక దాటిన 'మగాడు ప్రేమలో పడకపోతే ఆరో జబ్బుకింద తీసుకోమన్నాట్ట ఎవడో—" అని ఆగింది.

అతని ముఖంలోకి ఆముదం ప్రసరించడం స్పష్టంగా కనిపించి తృప్తిగా లోపలి కెళ్ళింది.

అంతవరకూ కళ్ళు మూసుకొని ఆనాటి సీన్లు ముందు కదులుతూవుంటే ఓ రకమైన ఆనందమే కలిగింది, మూర్తికి.

కళ్ళువిప్పి చూస్తే ఏముంది? సినిమా అయిపోయింది —

ఆమె లోపలికి వెళ్లిపోయింది.

మొత్తమ్మీద అఖండురాలే — శ్యామల!

* * *

రెండు నెలల తరవాత చెప్పాపెట్టకుండా ఇంటిముందు ఓ టాక్సీ ఆగింది.

ఎవరా అని చూశాడు, మూర్తి.

సరోజ, రామేశం. పెట్టె, బెడ్డింగులతో దిగారు.

మూర్తి నిర్ఘాంతపోయాడు.

"హల్లో, అన్నగారు! కులాసా? సారీ, ఉత్తరం రాయడానికి టైము లేకపోయింది. మేం బెంగుళూరు వెళ్ళాక రాదామనుకున్నాను. అక్కడ పని తొందర్లో అవలేదు. ఇదిగో అదిగో అనుకుంటూండగానే ట్రయిన్ ఎక్కడం — యిలా మీ యింట్లో దిగడం జరిగిపోయాయి!" అటూ పలకరించాడు, రామేశం.

తన ఉత్తరంమీద అంత దుమారం లేవదీసిన మనిషేనా, ఇతను!

మూర్తి ఆశ్చర్యంలోంచి ఇంకా తేరుకోలేదు - రామేశం పలకరింపుకి జవాబు చెప్పడం మర్చిపోయాడు.

ఇంతలో సరోజ ముసిముసిగా నవ్వుకుంటూ పక్కనుంచి తప్పుకుంటూ లోపలికి వెళ్ళింది.

వచ్చిన అతిధులకు ప్రారంభ మర్యాదలూ అవీ శ్యామలే చూసింది. ఓ గడియసేపు పోయాక మూర్తి గదిలోకి వచ్చింది; కూరల సంచీ, నూనె డబ్బా పట్టుకుని.

'గురూగారూ! చిన్న అమెండ్‌మెంటు!' అన్నది.

'చెప్పు' అన్నట్టు చూశాడు.

'మీ ఉత్తరంమీద రామేశం లేవదీసిన గొడవ అదంతా మన కల్పన—' అని అతని ముఖంలోకి చూసింది.

రెణ్నెల్లనుంచీ మేటవేసుక్కూచున్న చీకటి రేఖలు ఒకొక్కటీ విచ్చిపోతున్నాయి, అతని ముఖంలోంచి. అది కనిపెట్టి ఉత్సాహంగా చెప్పుకుపోతోంది:

'సరోజ, మీరు విడివిడిగా కన్నకలలు — అదీ చెప్పాక, మీ ఉత్తరానికి దాని మొగుడనేవాడు ఎలా రెస్పాండ్ అవడానికి అవకాశం వుందో ఊహించి అదంతా చెప్పాను. అది సరేగానీ, అర్జంటుగా ఏవో యిన్ని కూరలూ, నాలుగు కిలోల నూనె తెచ్చి పడెయ్యండి. అలాగే మీ ఆఫీసు శాల్తీ ఎవరైనా కనిపిస్తే ఇవాళ్టికి సెలవు చెప్పెరండి!' అని అంత అర్జంటుగానూ లోపలికి వెళ్ళబోయింది.

'ఆట్టే, ఆట్టే, ఆగాగూ. ఏమిటీ, అదంతా నీ కల్పనా—ఎంత అఘాయిత్యం మనిషివే, నువ్వూ—' అంటూ ఆమె వీపుమీద చరచడానికి చెయ్యి విసురుతూవుంటే —

'నాకూ కథలంటే ఇష్టమేనండీ!' అంటూ లోపలికి తుర్రుమంది శ్యామల.

---

స్నేహమో! ఎల్లాగయితేనేం ఆ సరోజనమ్మ ఈ సురేఖమ్మను యిక్కడనుండి లేవదీసి తన ప్రక్కకు చేర్చుకుంది. అందాకా నిద్రపోలేదు. ఇప్పుడు ఆజ్ఞ పెట్టేవారెవరున్నారు? ఇద్దరికీ సరిపోయింది. ఈవిడ మగడు వదిలిపెట్టిన కొమ్మ! ఆవిడ పెళ్లీపెటాకులూ లేని బొమ్మ!"

రాజయ్య మాట్లాడలేదు.

"వయసు, ఉద్యోగం, నలుగురితో కలిసి మెలసి తిరగడం, అన్నిటినీ మించి డబ్బు; ఇంకేం కావాలి? మనిషి చలవలావ్‌గా వుండడానికి!"

రాజయ్య మాట్లాడలేదు.

"రాతుకొద్దీ గుఱ్ఱం! మీరు మెత్తగా వుండడంచేత ఆడది అల్లా ఆడగిరిగింది! రేపు ఏదయినా అప్రతిష్ఠ వస్తే, అది మనకుగాని, దానికేం?"

రాజయ్య మాట్లాడలేదు.

"ఇంతకీ చేతకానితనం మీది! పెట్టె తీసుకు బయలుదేరినప్పుడు 'పో! ఇంట్లోకి పో! పోతావా లేదా?' అని గద్దించివుంటే వచ్చినట్లు వెనక్కి తిరిగేది. అసి తిరుగుతుందా, దాని తలలో జేజెమ్మ తిరుగుతుందా! మనకూ నెలకు వంద రూపాయలు పోకుండా వుండేవి. నా కర్మ కాకపోతే, నా మొగుడు ఇంత దద్దమ్మ కావడం ఏమిటి?"

"ఎవరే గాడిదా? దద్దమ్మ ఎవరే?" అని రాజయ్య గంగమ్మ రెండు చెంపలూ చెళ్లుమనిపించాడు.

"అమ్మో! చచ్చానర్రో! నా మొగుడికి పిచ్చెక్కిందర్రో!" అని విరుచుకుపడిపోయింది గంగమ్మ.

పిల్లలు చుట్టూ చేరి ఏడవడం ప్రారంభించారు. పడిపోయిన పెళ్లాన్ని రాజయ్య ఇట్టే లేపాడు. జుట్టు చేత్తో పుచ్చుకున్నాడు వేరొకచేత్తో వీపుమీద వడ్డించాడు. బిగ్గ ఆగా ఏడవాలని ప్రయత్నించింది.

"నోరు లేచిందా, నొక్కేస్తా" అన్నాడు.

గంగమ్మకు కోపం వచ్చింది నూతిలో పడి చద్దామనుకుంది. కాని వాళ్లింటి నూతిలో పడితే మనుష్యులు చావరు. చావకపోగా దెబ్బలు తగులుతై. కృష్ణలో వెళ్లి పడాలనుకుంది. కాని నడిచే శక్తీ ఓపికా కన్పించలేదు. తీరా వెళ్ళేలోగా పసికట్టి, మళ్లీ కొడితే ఒళ్లు నొప్పులుపెడుతుంది. చావుకు తెగించినవారుకూడా దెబ్బలుతినడానికి తెగించలేరు. అందుచేత కుమిలి కుమిలి అంచెలంచెలుగా ఏడ్చింది గంగమ్మ.

[ఇంకా వుంది]



'బంగారు బొమ్మలు'లో అక్కినేని సత్యనారాయణ

## సినిమా

(30 వ పేజీ తరువాయి)

### జయచిత్ర చిత్రమాల

రామానాయుడుగారి "సావాసగాళ్లు" వర్ణ చిత్రం, విడుదలయ్యే రోజు జయచిత్ర నటజీవితంలో నూతనోత్సాహాన్ని తెచ్చే రోజుగా వుంటుంది. ఎంత గొప్పగా నటించిందో!

రవిశంకర్ పిక్చర్స్‌వారి "తల్లి లేని పిల్ల" చిత్రంలో జయచిత్ర ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండగలదు.

విజయ... మాధవి పిక్చర్స్‌వారి వర్ణచిత్రంలో "నటసామ్రాట్"తో నటించడం, జయచిత్రకు కొత్త అంతస్తును తెచ్చిపెట్టగలదు.

ఫాల్కన్ యింటర్నేషనల్ వారి "నీతి... నీ విలువెంత" చిత్రం జయచిత్ర నటనా వైభవానికి నిదర్శనంగా నిలబడగలదు.

### జయచిత్రకు జయము

"సోగ్గాడు" చిత్రం విడుదలయినప్పుడు, "యవ్వనం కాటేసింది" చిత్రం విడుదలయినప్పుడు, "ముద్దబంతిపువ్వు" చిత్రం విడుదలయినప్పుడు, ప్రేక్షకులు జయచిత్ర నటన్ను మెచ్చుకున్నారు.

కొందరు ఎగ్జిబిటర్లు ఆమెను వాణిశ్రీగారి తర్వాతి నటిగా వర్ణించారు. అట్టి జయచిత్ర అంతగా మ్యాస్‌లో అగుపించకపోవడానికి కారణం ఏమిటని ఒక ప్రశ్న వుదయించింది, యిటీవల ఒక నిర్మాత గృహంలో.

"ఒక్కటే" అన్నాడు యీ విలేఖరి. ఆమె ఒకసారి ఒక నిర్మాతకు మాత్రమే కాల్‌షీటు నిచ్చే మంచి పద్ధతిని ఆచరణలో పెడుతుంది. పూర్వం వుండే అన్ని చిత్రాలు తనకే రావాలి అనేడి దురాశ లేకపోవడం.

1977 లో ప్రజల అభిమాన నటిగా గౌరవాన్ని అందుకునే నటకుల్లో జయచిత్ర ముఖ్యురాలుగా వుంటుంది.

జయచిత్రకు వున్న యీజ్, టైమింగ్, డైలాగు డెలివరీ ఆమెకు కవచాలు వంటివి.

### ప్రజలు కోరే జంట

"సోగ్గాడు" చిత్రం తరువాత శోభన్‌తో జయచిత్ర తరుచుగా చిత్రాలలో నటించాలి అని ఆశించిన లక్షలాది ప్రేక్షకులు, ఎప్పుడెప్పుడా అని ఆసక్తితో ఎదురుచూస్తున్నారు.

"శోభన్... చిత్ర" లను ప్రేక్షక జనం అభిమాన జంటగా ఆదరించగలరు.

### ప్రభకు మంచి ప్రారంభం

1977 ప్రభకు మంచితో ప్రారంభమైంది. కొత్త దర్శకుడు కోటారెడ్డికి, కొత్త నిర్మాత అన్నారావుకు, కొత్త సంగీత దర్శకులు శంకర్... గణేష్‌కు "సంసారంలో సరిగమలు" చిత్రం ఆనంద ఫలితాన్ని యిచ్చింది.

నటిగా ప్రముఖురాలే అని అందరూ అంటారు. కానీ "ప్రభ"కు యివ్వవలసిన పొజిషన్ను పరిశ్రమ యింకా యివ్వకపోవడం ఆశ్చర్యంగా వుంది.

ప్రభ చిన్న పాత్ర పోషించినా, పెద్ద పాత్రను ధరించినా, ఆమెవరకు యింతవరకు ఫెయిల్యూర్ లేదు. అయినా ఆమెను సరయినవిధంగా ప్రోత్సహించడంలేదు. ఆదే మన తెలుగు చిత్ర పరిశ్రమలో అనాదిగా జరుగుతున్న విచిత్రము.

### పనికొచ్చే పాత్రల్లో ప్రభ

పరుగిడి పాలు త్రాగేవాళ్లు ఎక్కువకాలం ప్రకాశించరన్న నమ్మకాన్ని గట్టిగా విశ్వసించే ప్రభకు నిలబడి నీళ్లు త్రాగడమంటేనే యిష్టం.

ఆమె యిప్పుడు వేస్తున్న వేషాలన్నీ పనికొచ్చే భవిష్యత్తును ఏర్పరచగలవన్న నమ్మకం యీ విలేఖరికి వుంది.

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి "అత్తవారిల్లు" చిత్రం ప్రభకు ఆనాడు "భార్యాభర్తలు" చిత్రం కృష్ణకుమారికి అర్జించిపెట్టిన భవిష్యత్తును తెచ్చిపెడుతుంది.

అదే ప్రత్యగాత్మ (భార్యాభర్తలు) "అత్తవారిల్లు" చిత్రం ద్వారా ప్రభకు విలువయిన నట జీవితాన్ని ప్రసాదించడం గమనార్హం.

### అపురూపమైన పాత్రలు

ప్రభకు రాబోయే అవిడ చిత్రాలన్నీ నటిగా ఔన్నత్యాన్ని తెచ్చిపెట్టగలవు.

అగ్రదర్శకుడు దాసరి సృష్టించిన "ఇదెక్కడి న్యాయం" పాత్ర ప్రభను మరింత గొప్ప నటిగా చెయ్యగలదు.

"జీవితంలో వసంతం" చిత్రం ప్రభకు హెచ్చు స్థాయిని తెచ్చియివ్వగలదు.

మావుళ్లయ్యగారి "గీత... సంగీత" చిత్రం ప్రభ యొక్క నట జీవితంలో మధురానుభూతిని కలిగించగలదు.

రామానాయుడుగారి "సావాసగాళ్లు" చిత్రం ప్రభను ఒక ఉత్తమ క్యారెక్టర్ నటిగా ప్రజలచేత అంగీకరింపచెయ్యగలదు.

— శ్రీనివాస్



'రాజాకోట రోజా'లో ఒక దృశ్యం * 'నన్ను ప్రేమించు'లో ప్రదీప్‌బాబు, అరత



# ఎర్రగులాబీలు

వి.వి.బి. రామారావు

సావిత్రిని గురించి పొరపడ్డాను

"కళ్లుండీ, ఆ మాత్రం తెలుసుకోలేవూ?" మందలించింది శ్రీదేవి.

అసలు ఆర్డర్సు వచ్చినపుడు నేను బందరులో లేను. రెండు రోజులు శెలవు పెట్టి గుడివాడ వెళ్లా, శ్రీదేవి భాషలో "పుట్టింటికి" అమ్మ గోల, వదిన దెప్పి పొడుపులూ భరించలేక.

"ఏం గిరిజమ్మగారూ, మీ శ్రీదేవిగారు శెలవివ్వరేం? స్నేహితురాలంటేనే ఇంత 'ఇది' అయిపోయి వెనక ఉన్న చెవులన్నిటినీ మరిచిపోతే, ఇకముందు ఆ వరుడొస్తే మేం వచ్చి చూడాల్సిందేనన్నమాట" వదినగారి ఉత్తరంలో ఆవిడ జెలసీ, పొసెసివ్‌నెస్ కొద్ది పాళ్లలో రంగరించబడి అభిమానం ఘాటుని పించి వెంటనే రెండు రోజులు శెలవు పెట్టాను.

నేను బందరు తిరిగొచ్చేసరికి శ్రీదేవి నాకోసం కాలుకాలిన పిల్లిలా తిరుగుతోంది.

"గిరిజా, నువ్ వెళ్లగానే తెలిసింది. టెలిగ్రాం ఇచ్చేద్దామనుకున్నా!"

టెలిగ్రాం అంటే బామ్మకి భయం. నాకు బామ్మ పోలికలున్నాయంటుంది వదిన. శ్రీదేవి టెలిగ్రాం అనేసరికి నాకు కొంచెం వణుకు గొంతులో మొదలైంది.

నన్ను ఆట పట్టించడం శ్రీదేవికి సరదా.

"ముఖ్యవార్త శుభమో అపశుభమో నువ్ తేల్చుకో!"

"అసలు నువ్ చెబితేకదా!"

"రెడ్ రోజ్‌కు విశాఖ బదిలీ అయింది."

"వాట్! మరి ఆ తుమ్మెద సంగతి?"

శనివారం సాయంకాలం గోదావరి ఎక్స్‌ప్రెస్, ఆదివారం సాయంకాలం డౌన్. ఇంతే సంగతులు."

"నువ్ అత్తగారి వయితే కోడలుపని ఖాళీ—"

ట్రాజిక్‌గా రెడ్ రోజ్ కథ – రెడ్ రోజ్ అంత అందంగానూ, అంత సౌరభాన్ని వెదజల్లుతూనూ ఉంటుంది. మా కొలీగ్. అంతా కలిసి డివిజనల్ ఆఫీసులో పనిచేస్తున్నాం. రోజ్ పెనిమిటికి నోబుల్ కాలేజీలో ఉద్యోగం ట్రాన్స్‌ఫర్‌లు లేని బతుకు. రోజ్ తన వైవాహిక జీవితంలో ఆనందాన్నీ, తృప్తినీ, సౌఖ్యాన్నీ వాటికి సన్నిహితమైన ఇతర అనుభూతుల్నీ మా "పెళ్లికాని" పిల్లల ఎదుట దండోరావేస్తూ ప్రదర్శిస్తూ ఉండడమే కాకుండా – మావంక తిరిగి – పాపం వీళ్ళకి పెళ్లికాలేదు. వీళ్లకా ఆనందాలేం తెలుస్తాయ్ – పూర్ క్రీచర్స్—' నిజంగా ఆమె దృష్టిలో మేం మనుషులం కాదు. బీద కీటకాలం. పెళ్లికాకపోడానికి కారణం మాలో ఏదో పెద్ద లోపమేనని ఆమె నమ్మకం.

ఆమె వైవాహికానందానికి ఈ ట్రాన్స్‌ఫర్ ఘోరమైన అవరోధం. భర్త బందరూ, భార్య విశాఖా, దేవుడిబిడ్డ రోజ్‌కి ఇది చిన్న సైజు శిక్షేమోననిపించింది నాకు.

## రాలిన ముత్యాలు

....శ్రీ సోమసుందర్....

పాతాళలోకంలో సరీసృపాలు
నడుపుతున్నా యష వేద పాఠశాలలు
అధర్వణ వేదంలోగల అణ్వస్త్ర రహస్యాలు
పరిశోధించి దించుతాయష సాకల్యంగా!

"రోజ్ అంటే నీకు అంత కసిఅన్నమాట! ట్రాన్స్‌ఫర్ వార్త నాకు వైర్‌చేసి చెబుదామనుకున్నావన్నమాట?"– కసిగా అడిగాను.

'యూ ఫూల్ రోజ్ పోయి మన కనవసరం. ఇక రోజ్ తన సింహం పట్టుకొస్తుంది మనదగ్గరికి. బీ కేర్‌ఫుల్!"

"వాట్ కెన్ యూ మీన్?"

"రోజ్‌తో పాటు మనకీ ట్రాన్స్‌ఫర్ అయింది విశాఖ. రేపు మాంచిరోజు. బయలు దేరి పోదాం."

– తీరా విశాఖ వచ్చాక డివిజినల్ ఆఫీసు నాలుగు విసిరేసినట్టున్న బిల్డింగుల్లో ఉన్నట్టు తెలిసింది. రోజ్ రాజేంద్రనగర్. నాకూ, శ్రీదేవికీ (ఎంత అదృష్టం), ద్వారకా నగర్.

మాకు రోజ్ వదిలిపోయిందనుకున్న తృప్తి లేకుండా సావిత్రి ప్రత్యక్షమైంది.

శ్రీదేవి మనుష్యుల్ని ఇట్టే చదివేస్తున్నది.

"ఎవరే ఆమూర్తి?' శ్రీదేవి ప్రశ్న వెయ్యకముందే దానిముఖంలో ఈ ప్రశ్నని చూశాను.

"నాకేంతెలుసు! నువ్ అడగాలింది?"

బుంగమూతి పెట్టేసిన శ్రీదేవి మరో అరగంటకి డైరెక్ట్‌గా మనసులోని విషయం మళ్ళీ ప్రస్తావించింది.

"అబ్బ! మూర్తి మూర్తి' అని బోర్ కొట్టేస్తోందే. రోజ్‌నయమనిపిస్తోంది.. ఆవిడపేరు నీకు తెలుసా?"

"సావిత్రి!"

'భేష్! మూర్తి అసలుపేరు సత్యమూర్తి అయి ఉండవచ్చు!

'పోనీ సత్యవంతుడే అనుకో ఏంపోయింది?' నేంనేశా.

"అసలు ఆవిడ ముఖంచూస్తే..."

"చాలా ఆనందంగా ఉంది. రోజ్‌కు

## ఎర్ర గులాబీలు

రెండింతలు ఆనందాన్ని సౌరభంలా వెదజల్లుతోంది. మూర్తి ఆమెలవర్ అయి ఉంటాడు.'

లంచ్ టైంలో ఓ అరగంట పోయిన్‌లో బాతాగానీ. "మూర్తికి కాఫీలో ష్యుగర్ ఎక్కువయితే చిరాకు... మూర్తికి టీతోపాటుస్నాక్స్ కావాలి ... నిన్న ఇరవై అడిగా సినిమాకెల్దామని. లేపనేశాడు హామీన్ ఆఫ్ హిమ్..."

మిషనరీ స్కూల్ యాక్సెంటు - వయ్యారంగా కట్టుకున్న గంజి పెట్టిన నేత చీర. మూర్తి సావిత్రి లవర్ అనుకున్నాను. అదే నేను చేసిన పొరపాటు "కళుండీ ఆ

మాతం తెలుసుకోలేవూ?" నన్ను మందలించింది శ్రీదేవి. 'యూ ఫూల్. ఆమెకు మెట్రిక్ చదువుతున్న అమ్మాయీ, ఎయిత్ చదువుతున్న అబ్బాయీ వున్నారు!" పెళ్లయిన తరవాత కూడా ప్రతి నిముషానికీ, మూర్తి మూర్తి అని పట్టపగలు పలవరిస్తూంటే మూర్తి ఆవిడ "టు బీ" అనుకున్నా.

–మరుసటి రోజు ఐదు గంటలకి ఐదు నిముషాలుందనగానే సావిత్రి వెళ్ళిపోవడం, పని ఉన్నట్టు శ్రీదేవి కిటికీ దగ్గరకు వెళ్లడం నేను గమనిస్తూనే ఉన్నాను.

ఆ సాయంకాలం శ్రీదేవి మళ్ళీ బోల్డు న్యూస్ తీసుకొచ్చింది "సావిత్రి హజ్బెండ్‌కి యూనివర్సిటీలో ఉద్యోగం స్కూటర్‌మీద భార్యను డ్రాప్‌చేసి ఐదింటికి పిక్ చేస్తాడు."

–మూర్తికి ఏది ఇష్టం, ఏది చిరాకు. ఎన్ని గంటలకు లేస్తాడు. ఎన్ని గంటలు నిద్రపోతాడు నిద్ర వస్తోందంటే ఇంకా ఎక్కువసేపు చిలిపితనంతో లైటు ఆర్పకుండా... మూర్తికి ఎన్ని తలగడాలు కావాలో మూర్తి ఏ డాయర్సు (కట్) ప్రత్యేకించి కొనుక్కుంటాడో మూర్తికి ఏ వంటలు నచ్చుతాయో, ఏ రంగులంటే ఎలర్జీయో, ఇలా ఇలా వెరీ వెరీ పెర్సనల్ థింగ్స్‌తో బాటు వెరీ వెరీ సిల్లీ థింగ్స్ జోడించి చెబుతుంటే చుట్టూ కూడిన ఆడా మగా చక్రాల్లా తిరుగుతున్న ఆవిడ కళ్ళవంక చూస్తుండడం, శ్రీదేవికి చాలా బాధగానూ, నాకు ఎబ్బెట్టుగానూ ఉండేది

"పెట్రోల్‌కీ సర్వీసింగ్‌కీ నాలుగు వందలు... హౌస్ టాక్స్ మూడు వేలు... టెలిఫోన్ బిల్..."

మరో రోజు సావిత్రి వల్లె వేస్తోంది. ఏకాంతంగా వినలేక బయట ఎండగా ఉన్నా మెట్లు దిగాను ఊపిరాడక.

సావిత్రి బోరు ఆఫీసులో– అనంతరం, ఇంటిదగ్గర సావిత్రి బోరు గురించి శ్రీదేవి బోరు.

బొమ్మ బోరు గెలిచేటట్టుంది. ఈ సంబంధం మూడొంతులు ఖాయమవుతుందట. శ్రీదేవిని ఎలా వదలడమా అన్న బెంగ పీకుతోంది మనసులో.

విశాఖవచ్చి నెలరోజులవుతోంది. శ్రీదేవి

## జేబుదొంగల మహాసభ!

పశ్చిమ జావాలోని బాండుంగులో జావా ద్వీప జేబుదొంగ మహాసభ జనవరిలో జరిగిందని ఒక వార్తా సంస్థ తెలియజేసింది.

జావా ద్వీపంలోని జకర్తా, బాండుంగ్, సెమరాంగ్, సురబాయా నగరాలకు చెందిన జేబు దొంగలు ఈ మహా సభకు హాజరయ్యారు. నగరంలోని అత్యంత విలాసవంతమైన ప్రాంతంలో ఈ మహాసభ జరిగింది.

దక్షిణ సుమిత్రాలోని పాలెంబాగ్ నగరం నుంచి యిద్దరు జేబు దొంగలు ఈ మహాసభకు పరిశీలకులుగ వచ్చారు.

వచ్చే సంవత్సరం జేబుదొంగతనాల ఏర్పాట్లను ముఖ్యంగా ప్రభుత్వం నేర నిరోధానికి ఉచితమైన చర్యలు తీసుకుంటున్న దృష్ట్యా జరగవలసిన ఏర్పాట్లను రూపొందించుకోవడానికి ఈ మహాసభ జరిగినట్లు విశ్వసించ బడుతున్నది.

జేబుదొంగల్లో జిల్లాలవారీ పంపిణీలను పటిష్టం చేయడానికి కూడా ఈ మహాసభ చర్యలు తీసుకుంటుంది ఇటీవల జేబుదొంగలు పెద్ద సంఖ్యలో జకర్తా నగరానికి వచ్చి చేరడం వల్ల అక్కడ మామూలుగా జేబు దొంగతనాలు చేసుకునే వారిలో అశాంతి ప్రబలడం వల్ల ఈ చర్య అవసరమైంది.

అప్పటికప్పుడే నన్ను వదిలెయ్యాల్సి వస్తుందన్న భయంతోనో ఏమో పక్కింట్లో ఓ అమ్మాయితో చాలా లోతుగా స్నేహం చేసేసింది.

"స్కూటర్ అబ్బాయి ఈరోజు రాలా?" అడుగుతోంది బయట వరండామీదకొచ్చి.

ఇలాంటి "వాసనలు" అరమైలు దూరం నుండి పీల్చగలగడం శ్రీదేవి సొంతంగా నేర్చుకున్న విద్య.

చిరునవ్వు నవ్వేసింది పక్కింటమ్మాయి. "అదిసరేగాని సావిత్రిగారిని మీకు తెలుసా?"

"సావిత్రా? ఎవరావిడ?"

"ఓస్, బడాయి, మీ ఆఫీసులోనే ఉద్యోగం...నేనూ అ ఆ లూ, ఇ ఈ లూ చదువుకున్నా...బొత్తిగా అంత చవట కింద కట్టెయ్యకండి."

"ఓహో ఆవిడా! మహాపతివ్రత!"

"వ్యంగ్యమా!" అమాయకంగా అడిగినట్టడిగింది పక్కింటమ్మాయి.

నా వంక చూసింది శ్రీదేవి.

"కాదండీ, ఆవిడకు మూర్తే లోకం... మూర్తికి ఆవిడే లోకం"

మూర్తికి ఆవిడేలోకం కావచ్చునేమో! ఆవిడకు మూర్తి కాదు" దివ్యదృష్టితో చూస్తున్న ఋషి పుంగవుడిలా మొహం పెట్టేసింది పక్కింటమ్మాయి.

"అంటె?"

"ఈరోజు లక్ష్మివారం ... శనివారం వరకూ ఆగండి"

ఠక్కున ఆపేసింది డిస్కషన్.

శనివారం సావిత్రిని స్కూటర్ పిక్అప్ చెయ్యలేదని రూంకు రాగానే చెప్పేసింది శ్రీదేవి.

కాస్త సేదతీరుతుండగా పక్కింటమ్మాయి వచ్చింది.

"బియ్యం పడేశారా?"

"లేదు"

"మరేం అనుకోకండి. మా ఇంట్లో భోజనం చేద్దురుగాని ... చెల్లికి శనివారం సినిమాకు వెళ్ళిపోయింది. నాకు తలనొప్పిగా ఉందని వెళ్ళడం మానేశా. చెల్లి యూనివర్సిటీలో చదువుతోంది. నేను సంగీతం నేర్చుకుంటూ చెల్లెల్ని చూసుకుంటూ..."

తొమ్మిది దాటుతోంది. కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేసేశాం. మా గోంగూర పచ్చడీ, నల్ల కారివికారం, నేను ఇంటి నుంచి తెచ్చిన నెయ్యి...

"సావిత్రి వచ్చేసినట్లుంది" టప్ అని లైట్ ఆర్పి కిటికీ వద్దకు పరిగెట్టింది పక్కింటమ్మాయి.

శ్రీదేవీ, శ్రీదేవి వెనకాల నేనూ కిటికీ దగ్గరకు వెళ్ళకుండా ఉండలేక పోయాం.

ఆటో వెనక్కి వెళ్ళిపోయింది.

సావిత్రి తలుపు దగ్గరకు రాకుండానే 'హాయి డార్లింగ్!' అని పలకరింపు. నేను నెలరోజులకు చూస్తున్నాయినే.

"సూర్యనారాయణగారని ఎల్. ఐ. సీ ... పదిహేనేళ్ళ క్రిందట పాపం పెళ్ళయిన సంవత్సరానికే ఆవిడ స్టౌ అంటుకుని పోయిందట.. సావిత్రి లేకపోతే ఏమయేవాడో..."

"మరి సావిత్రి హస్బెండ్?"

"ఆయన దోవకు ఆవిడ అడ్డురాదు ... ఆవిడ దోవకు..."

నేను మరి వినదలచుకోలేదు.



**వి. కె. లిడదవోలు**

విడాకులు పొందిన స్త్రీ శ్రీమతా? కుమారియా?

మిస్సనే వేసుకొంటున్నారు.

**ఆర్. ఎల్. సువాబేడ**

తనకన్న వున్నవాళ్ళతో పోల్చుకుని బాధపడతాడేగాని, తనకన్న తక్కువ వారితో పోల్చి సంతృప్తి పడడేం.

మానవ నైజానికది విరుద్ధం కనుక!

**వి.ఎస్. వి. ఆర్. జె. కె. భీమవరం**

స్నేహానికి మీరిచ్చే నిర్వచనం.

నీ కష్టాలు తగ్గించడానికీ, నీ ఐశ్వర్యంచూసి ఆనందించడానికీ సిద్ధంగా వుండే వో ,,న ,,.

**వి. ఆర్. ఆదోని**

నేడు భర్తలచే వంటలు ఇంటిపనుల చేయించే వనితా శిరోమణులపై మీ అభిప్రాయం?

అనవసరం ఎవరింట్లో వాళ్ళం చేసుకుంటే మధ్యన మన అభ్యంతరం ఏమిటి? అయినా ఇంటపనివంటపని ఆనేదానికి ధారదత్తం కాలేదే!

**వి. జె; ఎమ్; ఆర్. చిత్తూరు**

శ్రమకు అంతమేది?

లేదు వోరిమి కల గాడిదకి ఎప్పుడూ చాకిరీ తప్పదు!

**నాయుడు, గా రాజు. చీపురుపల్లి**

నిర్మొహమాటంగా నిర్భయంగా నీ కలం పాళీని అంపోవాలని వుంది. ఒ ,, హి స్తావా మానవ మహంకాళీ!

వద్దు భక్తా, అనవసరంగా నా కలం నీలాగా చిలకపలుకులు పలకడం ప్రారంభించే ప్రమాదం ఏర్పడవచ్చునని భయంగా వుంది.

**వి.ఎస్. వి. ఎస్. ఎస్. హైదరాబాదు.**

కొందరు అదృష్టవంతులకి అన్నీ కలిసివస్తాయి అవునా?

పొరపాటు. ప్రయత్నం చేస్తేగాని ఫలితాన్ని ఆశించడం ఎలా? ప్రయత్నించకుండా ఆశించడాన్నే అత్యాశ అంటారు.

ఎవరేమంటే దానికి తలూపడమే మంచితనమా?

కాదు. లోకం చెప్పిన దానికి 'సరిసరి' అని తల ఊపడం కాదు. నీవు నమ్మిన దానికి తలూపడమే విచక్షణ— అదే నీ అంతరాత్మకి ప్రాణం పోసుకోడం.

**పి. ఎన్. మక్కెంబాక (శ్రీకాళహస్తి)**

సమాజంలో స్త్రీకి స్త్రీయే శత్రువైనప్పుడు ప్రవర్తన మార్చుకొన్న పురుషులు మాత్రం ఏం చెయ్యగలరు? నేను పరిశీలించిన నాలుగు కేసుల్లో యిదే తేలింది.

ఒక్క మెతుకు ముట్టి చూస్తే చాలదా అన్న సామెత మనిషికి కాదు— వస్తువుకి. మీ లెక్కన నూటికి ముప్పయి వచ్చి పాసైన డాక్టరు చేతిలో మిగిలిన డెబ్బయి మంది చచ్చినా ఫరవాలేదన్నట్టుంది. ఒక్క క్షణం ఆలోచించి చూడండి— స్త్రీల తగవులాట వెనక సర్వ సామాన్యంగా వుండేదెవరని?!

**కె. ఎస్. కె. విశాఖపట్నం.**

మీవారు సంపాదిస్తున్నారు కదా, యింకా ఎందుకు మీకింత శ్రమ?

అంతా డబ్బు సంపాదనకే పని చేయరయ్యా— వ్యాపృత్తి కోసం, మానసికానందంకోసం, ఛాలెంజిలోవుండే థ్రిల్ కోసం కూడా పని చేస్తూవుంటారు.

**ఎమ్. ఎమ్. టి. మద్రాసు.**

ఎందుకిన్ని మతాలు?

అదే నాకూ అర్థం కాదు సోదరీ— ఎందరు దేవుళ్ళో, ఎన్ని మతాలో మెలికలు సాగి పోతూ— ఎన్నెన్ని దారులో! ఈ విషాద ప్రపంచంలో సాను భూతి ఒక్కటే చాలు కద!




**వి. వి. ఎన్. హైదరాబాదు**

పిల్లలు పెద్దల మాట ప్రకారం చదువుకోవాలి గాని వాళ్ళిష్టం వచ్చిన కోర్సులో చేరితే భవిష్యత్తు బాగుండదు కదా?

మీరలాగే అనుకుంటారు. కాని, మీ వరకూ వస్తే ఏమంటారో తెలుసా? ఏది చదవాలనివుంటే అది చదవాలి. బలవంతాన చదివిస్తే— ఆ చదువు నిరుపయోగం అంటారు. అంతే కదా!

**జి. ఆర్. ఆర్. కరీంనగరు.**

ఆడదాని జీవితం అరిటాకు వంటి దంటారే గాని, యీ కాలంలో ఆ సామెత సబబు కాదంటాను.

నిజమే. అసలీ మనుగడే అరిటాకు. ఉట్టి గాలికే చీలికలు వాలికలై పోతూ ముగించలేక సాగుతున్నట్టుంటుంది.

**శంకర్. కొవ్వూరు.**

ఆ నాటి యుగంలోని సీత, సావిత్రి, అనసూయ ద్రౌపతి లాంటి పతివ్రతలకు వుదాహరణగా మిమ్మల్ని తీసుకోమంటారా?

నేనే ఏమిటి? చాలీచాలని జీతాలతో గంపెడు పిల్లలనీ, తాగుబోతు భర్తలనీ, ఇంకా కావలిస్తే బాధ్యతలు పంచుకోరు గాని దెప్పి చుట్టాలనే కాదు చుట్టూ అవకాశం కోసం వేచివుండి ఓ రాయి వేద్దామని తహతహలాడే సంఘాన్ని. పీటన్నిటినీ ఎదుర్కొంటూ భవిష్యత్తులో కాస్తైనా జీవితం మెరుగు పడదా అని ఎదురు చూస్తూ సంసారాలు సాగించే మధ్యతరగతి మహిళామణులంతా సీతా సావిత్రీ, అనసూయ అంటున్నారే వాళ్ళకంటే మహనీయులే. కనీసం వారి కేవో మంత్రతంత్రాలు వరాలు వుండేవి. యిప్పుడవి లేవు కద!

**ఎస్ ఎ. పట్నాలగింపేట.**

ఈ కాలంలో విద్యార్థులకు నటీనటుల పై వుండే అభిమానం టీచర్లపై ఎందుకుండదు?

టీచర్లు చదవమని చంపుతారు. నటీనటులు వారి వంపు సొంపులలో.. కేరింతలు పెట్టిస్తారు. అందుకని.

**ఎమ్. పి. కురిశమర్తి.**

చాలా రోజులనుంచి మిమ్మల్ని ఒక ప్రశ్నఅడగాలని వుంది. మాలాంటి వారికి సమాధానం యిస్తారా?

అంటే నా కర్థం కాలేదు తమ్ముడూ. కుల గోత్రాలు, అంతస్తులూ, ఆర్భాటాలూ — చూసి జవాబులిస్తాననుకుంటున్నావా? తిట్టూ — మెప్పు ఒకటే నాకు. అలాగే ఎవరైనా ఒకటే— ప్రశ్నలో కాస్త చురుకో దపుటో వుండాలికాని!

**ఎమ్. వి. ఎస్. కాకినాడ.**

నీకు అయిదేళ్ళ క్రిందట సన్యాసం పుచ్చుకుంటాననిరాస్తే శిష్యకోటిని సమకూర్చుకోమని సెలవిచ్చారు. కాని యిప్పుడు నేను లక్షాధికారిని. ఒక కొడుకు తండ్రిని కూడా! ఏమంటారు?

సన్యాసం పుచ్చుకోకుండానే సంపాదించేశారే! మనలో మనమాట. అమ్మాయిదా అదృష్టం— కొడుకు తెచ్చినదా?! "ఎవరిదైతేనేం!" "సన్యాసి కోరిక!" అంటారా?!



శ్రీ వేంకటేశ్వర స్వామి వారి

# ఆర్జిత తెప్పోత్సవము

సంవత్సరమునకు ఒకసారి మూడు రోజులు జరుగుచున్న తెప్పోత్సవముతోపాటు ఇక మీదట శ్రీవారిని తిరుప్పళ్లి ఓడై [తెప్ప] మీద యాత్రికులు అనుకూలవంతముగా అనేకసార్లు దివ్యదర్శనము చేసుకొనుటకు వీలుగా ప్రతి మంగళవారము వారోత్సవముగా జరుపబడును. గృహస్థులు [భక్తులు] రూ. 1,500/—లు చెల్లించి ఈ ఉత్సవములో పాల్గొనవచ్చు.

ప్రతి మంగళవారము ఇతర అర్జిత ఉత్సవములు ముగిసిన తరువాత మలయప్పెరుమాళ్ల ఉత్సవ మూర్తిని శ్రీదేవి భూదేవులతో కన్నులపండుగగా అలంకరించి రంగమంటపమున కొలువుదీర్చెదరు. ఉత్సవములో పాల్గొను గృహస్థులకు ఇచ్చట సంకల్పము చెప్పబడును. తరువాత ఈ దివ్యమంగళ మూర్తులను దేవాలయపు నాలుగు తిరువీధులలోనూ వేదపారాయణముతో మంగళ వాద్యముతో ఊరేగించెదరు. స్వామిపుష్కరిణికి తూర్పుగట్టుకు చేరునప్పుడు శ్రీవారిని శ్రీదేవి భూదేవులతో దేదీప్యమానముగా అలంకరింపబడిన తెప్పపైకి ఎక్కించెదరు. అర్చకులు, పరిచారకులు, వేదపాఠకులు, మేళగాండ్రు మాత్రము తెప్పపైకి శ్రీవారిని అనుసరించెదరు. కట్నమును ఇచ్చి ఉత్సవములో పాల్గొను గృహస్థులకు పుష్కరిణి మెట్లవద్ద ప్రత్యేక స్థానము ఏర్పాటు చేయబడును.

తెప్పమీద శ్రీవారికి దేవేరులకు మంగళహారతినిచ్చి వేదపారాయణముతో, నాదస్వర సంగీతముతో పుష్కరిణిలో ముమ్మారు ప్రదక్షిణము చేయించి అనంతరము మధుర పదార్థములను నైవేద్యమొసంగెదరు. శ్రీవారికి తిరిగి మంగళహారతినిచ్చి ఉత్సవములో పాల్గొను గృహస్థునకు 5 గ్రాముల బరువు గల బంగారు పతకమును శ్రీవారి ప్రతిమాముద్ర కలిగిన దానిని సన్మానముచేసి, వస్త్ర భూషణము, నైవేద్య ప్రసాదములు ఒసంగబడును. కడసారి మంగళహారతినిచ్చి శ్రీవారిని దేవేరులతో తిరుచ్చిలో వాహన మంటపమునకు తీసుకొనిపోయి అచ్చట కొలువుదీర్చెదరు.

ప్రతి గృహస్థు తన కుటుంబముతో [మొత్తము 10 మందికి మించకుండా] తెప్పోత్సవము అయిన వెంటనే శ్రీవారి దర్శనమునకు అనుమతింపబడును.

శ్రీ వెంకటేశ్వరులవారికి వైభవోపేతముగా జరుగు ఈ దివ్యఉత్సవములో పాల్గొనకోరే భక్తులు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానముల వారిపేరున రూ. 1,500/—ల విలువ చేయు బ్యాంక్ డ్రాఫ్టుతో ముందుగానే పేష్కార్, తిరుమల తిరుపతి దేవస్థానములవారికి తెలియచేసుకొనవలసిన ప్రార్థన.

**ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

## ఏదిగొప్పది? ఏదితక్కువది?

ధనవంతుడి దృష్టిలో తాను గొప్పవాడు. దరిద్రుడు తక్కువవాడు. అందగాని దృష్టిలో అతడు అధికుడు. కురూపి హీనుడు. విద్వాంసుని దృష్టిలో విద్యావిహీనుడు హీనుడు. బలవంతుని దృష్టిలో బలహీనుడు చాలా తక్కువ. కాని దైవసృష్టిలో అంతా సమానమే. ఎక్కువ తక్కువలు లేవు.

పిపీలికాది బ్రహ్మపర్యంతం సర్వప్రాణుల లోనూ భగవంతుడు వ్యాపించి ఉన్నాడనీ, అతడు లేని చోటే లేదనీ తత్వవేత్తలు అంటారు.

ఎక్కువ తక్కువ భేదాలు మనం కల్పించు. కొన్నవేగాని యధార్థాలు కావు. ఒకప్పుడు ఎక్కువైనవని తోచేవి మరొకప్పుడు తక్కువ అని తోచకమానదు. పెద్ద శరీరం గల ఏనుగు తనకంటే చాలా చిన్నదైన సింహాన్ని చూస్తే హడలెత్తి పోతుంది. సింహం స్వప్నంలో కనబడినా అది ప్రాణాలు పోయేటంత కంగారు పడుతుందంట ! అందువల్ల గొప్పవాళ్ళు తక్కువవాళ్ళను హీనంగా చూసి నిరసించ కూడదు. ఆ అల్పునివల్లనే ఒకప్పుడు తనకు పని కావలసి వస్తుంది. దీని కొక చిన్న ఉదాహరణ–

## ధర్మపథం

ఒక మహారణ్యంలో ఒక మృగరాజు ఒక పొదరింటిలో పండుకొని నిద్రపోతున్నది. ఆ దగ్గరనుండే ఒక కన్నంలోంచి ఒక చిన్నఎలుక వచ్చి చప్పుడు చేస్తూ దానికి నిద్రాభంగం కలిగించింది. ఆ ఎలుకపిల్ల అంతతో ఊరుకోలేదు. ఆ సింహంపైకి ఎక్కి ఎగిరి గంతులు వెయ్యసాగింది. సింహానికి చాలా కోపం వచ్చింది. ఆ చిన్న ఎలుకను చంపెయ్యాలని అనుకొంది. కాని, అది దొరికితేనా? కొంతసేపు ఆలోచించి కదలక మెదలక పండుకొని, అది తన కాలి దగ్గర చెరలాడుతున్నప్పుడు ఒడుపు చూచి పట్టుకున్నది. ఎలుకపిల్ల గడగడలాడిపోయింది. 'మృగరాజా! నన్ను చంపక విడిచి పెట్టు ఇకమీద బుద్ధిగా ఉంటాను. నన్ను విడిచి పెడితే నీకు ఉపకారం కూడా చేస్తాను. అని ఎలుక అన్నది. ఉపకారం చేస్తానన్నమాటకి మృగరాజుకు కోపం పోయి నవ్వువచ్చింది. పోరా పిచ్చి పుల్లాయ్; నువ్వు ఉపకారం చేసేదేమిటి? పో! ఇక ఈ పక్కకు రాకు'' అని విడిచి పెట్టింది.

కొద్దిరోజులకి ఆసింహం ప్రమాదవశాత్తూ ఒక వేటగాని గట్టివలలో చిక్కుకుంది. దాని నుంచి బయటపడే ఉపాయం తోచక బాధపడుతూ ఉండినది. ఆ మార్గాన పోతూ ఉన్న వెనకటి యెలుక సింహాన్ని గుర్తించి, ఆ వల త్రాళ్ళను కొరికివేసి దాని ప్రాణాన్ని కాపాడింది. సింహం నిర్ఘాంతపోయింది. ఎలుకకున్న శక్తి తనకు లేకపోయిందే అని దాన్ని అధిక్షేపించినందుకు పశ్చాత్తాపపడి కృతజ్ఞత తెలిపి తనదారిన వెళ్ళిపోయింది.

అందువల్ల అల్పులవల్లకూడా అధికులకు ఒకప్పుడు ప్రయోజనం ఉంటుంది. కొన్ని సమయాల్లో అధికుల సర్వశక్తులూ నిష్ప్రయోజనాలయి అల్పుల శక్తియే కార్యాన్ని సాధిస్తుంది ఈ సంగతిని అధికులమని విర్రవీగేవారు కొంచెం ఆలోచించి ఎవ్వరినీ హీనంగా చూడకుండా ఉండాలి ఆయా సమయాలనుబట్టి అధికులే అల్పులయి, అల్పులే అధికులవుతారు. ఒకరిపని యింకొకరు చెయ్యలేరు. ఎవరిపని వారికి ఘనం, తన పని హీనమయినదని అనుకొనేవాడు ఎప్పుడూ ఆ పనిని చక్కగా చెయ్యలేడు.

సర్వసమదృష్టిని అలవరచుకోవడం అందరికి ఎంతో అవసరం.

— బులుసు వేంకట రమణయ్య



విజయవాడలో సంక్రాంతి నాడు ఆంధ్ర నాటక కళాసమితి ఆధ్వర్యాన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యకు ఘనమైన సన్మానం జరిగింది. అభినందన సంచికను ఆవిష్కరించి కళాకారుని సత్కరిస్తున్న న్యాయమూర్తులు శ్రీ ఆవుల సాంబశివరావు. సభకు కనిగచర్ల శేషయ్యగారు అధ్యక్షత వహించారు.

## తరు, పశు పక్ష్యాదుల ప్రపంచ పటం

మాస్కో విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలు ప్రపంచంలో తరు, పశు పక్ష్యాదుల వునికిని తెలిపే పటాన్ని తయారు చేశారు చేపలు, సముద్రపు నాచు, ప్లాంక్టన్‌లు సముద్రంలో ఎక్కడెక్కడ వుంటాయో యీ పటంలో గుర్తించబడినాయి. వీనిలో 56 శాతం ఆఫ్రికాకు పశ్చిమాన, ఇండొనేషియా, ఆస్ట్రేలియా, మధ్య అమెరికాల తీర ప్రాంతాలలోనూ వుంటాయని శాస్త్రవేత్తల అంచనా. భూమిమీనా, సముద్రాలమీనా తరు, పశు, పక్ష్యాదుల వునికిని నిర్ణయించే సామాన్య సూత్రాలను శాస్త్రవేత్తలు వివరించారు.

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

మీ కార్యక్రమాన్ని ప్రతి రోజూ ఉత్సాహంగా ప్రారంభించడంకోసం మీకు కూడా, రైలు మాదిరిగా, యింధనం కావాలి. శక్తినిచ్చే యింధనం మిమ్మల్ని రోజల్లా చురుకుగా వుంచి, చకచకా పనులు చేసుకునేటట్లు చేస్తుంది. అందుచేతనే ప్రతి ఉదయం మీకు బూస్ట్ కావాలి. ముఖ్యంగా పనిలోనూ, ఆటల్లోనూ అదనపు శక్తిని వినియోగించే మీ పిల్లలకి కావాలి. వారికి బూస్ట్ యివ్వండి. ఇది కొత్త మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసినది. బూస్ట్‌ని పూర్తి మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారు చేశారు. ఇందులో సహజమైన విటమిన్లు, ఖనిజాలు వున్నాయి.

బూస్ట్‌లో, యిటువంటి మరే యితర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పాలు వున్నాయి. బూస్ట్‌లో మరింత ఎక్కువగా పాలు వున్నాయంటే, మీ పిల్లలు పెరగడానికి మరింతగా పోషణ పదార్థాలు, మరింతగా మాంసకృత్తులూ లభిస్తాయన్నమాట. బూస్ట్‌లో ఎక్కువగా పాలు వుండటంవల్ల ఎక్కువగా మీగడగా వుంటుంది. మీకు ఆ రుచి తెలుస్తుంది.

అంతేకాదు, బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా ఎంతో యిష్టపడే మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన వున్నాయి. మీ రోజుని ప్రారంభించేందుకు యిది ఖచ్చితమైన మార్గం—ప్రతి రోజూ.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

# సామాన్యుని సణుగుడు

## దేవుఁడే ఇచ్చాడా? వీధి ఒక్కటి?!

ఈ మధ్యనే ఓ పత్రికలో ఒక వార్త పడ్డది... వరంగల్ జిల్లా పరిషత్ స్కూళ్లలో ఒక్కదానికీ 'పాయిఖానా'లు లేవుట! వార్త పడ్డది కనుక ఈ సంగతి తెలిసింది కాని చాలాచోట్ల పాయిఖానాలులేని పాఠశాల లున్నాయి. మంచినీళ్ళు కూడా వుండని పాఠశాలలూ వుంటాయి.

అంతవరకు ఎందుకు? మన పట్టణాల్లో రెండు వీధుల మధ్య చిన్న గొంది వుంది అంటే అదే వో పెద్ద పాయిఖానా...

మ్యునిసిపాలిటీలున్న పట్టణా లున్నాయి. బోలెడు ఎలిమెంటరీ స్కూళ్ళు – హయ్యర్ ఎలిమెంటరీ స్కూళ్లు – పురజనుల నిధుల నుంచి – పురపాలక సంఘాల ఆధ్వర్యంలో నిర్వహింపబడుతూంటాయి కదా!

వీటి సంగతే చూడాలి... 'ఒంటేలు గంట' కొట్టేసరికి; కీ ఇచ్చి వదిలిన మర బొమ్మల్లాగ "తురు" తుర్రున పరిగెత్తుకు వస్తారు పిల్లకాయలు రోడ్లమీదకు... గబ గబా "మూత్రాశయా" లని ఖాళీ చేసుకుని ఆ ప్రక్కనే ఉన్న చిరుతిళ్ల దుకాణాల మీద పడతారు...వీళ్ళు యిలా వాటిమీద వాలేసరికి అందాకా వాటిమీద వూసులాడు కుంటున్న 'ఈగ' లెగిరిపోతాయి.

ఓ స్కూలున్నదీ అంటే ఆవీధి అంతా యిక "పాయిఖానా" యే నన్న మాట! ఆ స్కూలు లోపల వేరే మరుగుదొడ్లల్లాంటివి వున్నా కూడా పిల్లలు వాటిని వాడాలన్న ఆంక్ష విధించే తీరిక టీచర్లకి వుండదు...

స్కూలున్న వీధి అని వేరే చెప్పనక్కరలేదు. పాతిక గజాల దూరం దాకా 'యూరియా' కంపు ముక్కులు పగుల గొడుతూంటుంది.

తమాషా యింకోటుంది... 'టీచర్ల మాట వినరు' విద్యార్థులు అనుకోడానికి కూడా వీలులేదు ఇంతమంది పిల్లలుంటారు– ఐదేళ్ళనుంచి పదిహేనేళ్ళదాకా వయస్సు లున్న వాళ్ళు – ఒక్కడు కూడా – స్కూలు గోడల మీదకాని - ఆ గోడలవేపు తిరిగి కాని కార్యక్రమం పూర్తి చేసుకోడు ... అదేనా? డిసిప్లిన్??

మ్యునిసిపాలిటీవాళ్ళు పౌరుల అలవాట్లు మార్చడంలో అనుసరించే పద్ధతులేమిటో మామూలు మనుషులకి అర్థం కావు గాని – వాళ్లెంతసేపూ కాల్వగట్లు 'ఖరాబు' చేస్తున్నారో అని ఆందోళన చేస్తూంటారని మాత్రం తెల్సు ... ఇట్లా వీధులను 'ఖరాబు' చేసే జన్మహక్కు గలవాళ్లు పాఠశాలల పిల్లలేనా? కాకాహోటేళ్ళు, కిల్లీకొట్లు – లాగుడుబళ్లు కొట్లువాళ్లు యింకా యిలాంటి చాలామంది వుంటారు...

పురపాలక అధికారులు యిటువంటి విషయాల్లో - నరసింహ శతక కారుడు చెప్పిన సూత్రాన్ని ఓసారి గమనించాలి... తనయుడు తప్పు చేసిన తండ్రి తప్పు తనయ తప్పు చేసిన తల్లి తప్పు ..." అన్నాడు అట్లాగా పారిశుద్ధపు పనిని అజ్మాయిషీ చేసేవాళ్లని – మునిసిపల్ ఎలిమెంటరీ స్కూళ్ళ టీచర్లనీ కూడా, విద్యార్థుల పాయిఖానా అలవాట్లు మార్పించేటందుకు పురిగొలిపితే తప్ప – తప్పంతా మ్యునిసిపాలిటీదే అవుతుంది!

మన దేశంలో మనుషుల అలవాట్లు మారితేగాని మనం ఏం చెయ్యలేం - అది వేరే "రోదన" – దేవాలయాలుంటాయి – మన జాతికి గొప్ప భక్తి కదా! ఓ సారి దేవాలయాల వెనుక గొందిలోకి పోయి చూడండి – దేవాలయపు ప్రాంగణ కుడ్యం ఎంతో మంది "అక్కరకు" మరుగుగా మాత్రం వినియోగపడుతూ వుంటుంది...చట్టముంది.

... చట్టాన్ని అమలు చేసే యంత్రాంగం వుండాలి కదా ... అది సవ్యంగా అమలు కావాలి కదా ...

మ్యునిసిపల్ స్కూళ్ళ మీద మెరుపు 'దాడులు' తనిఖీ నిర్వహించే అధికార యంత్రాంగం – వీధికో "చెత్తకుండీ" ఏర్పాటు చేసే "పురపాలక సంస్థ" వుంటేనే కొంత మన పట్నవాసపు 'దుర్గంధ' బాధలు పౌరులకు తప్పిపోతాయేమో ... ఏమోమరి?! లేదా "దేవుఁడే యిచ్చాడు వీధి ఒక్కటి! మిత్రమా!" అని పాడుకొంటూ ...

[ వీరాజీ ]

ఎవరెంత చెప్పినా ఇది మాయ కాలమనే అంటుంది వసుంధరమ్మ. లేకుంటే ఈ ఆడవాళ్లు మొలకంత చాలీ చాలని గుడ్డకట్టుకుని ఎగరడమా? మొగుళ్లో ఎదిరించి పదిమందిలో నంగనాచిలా చూపనా; సాలివ్వడమా? ప్రేమలు పెళ్ళిళ్ళు, విడాకులు! ప్చ్! పెళ్లి చూపుల కొచ్చి అరగంట తక్కువ కాకుండా మాటలా? అరగంటలో పెళ్ళిళ్లా? ఇవన్నీ వసుంధరమ్మకు గిట్టవు.

తల్లిదండ్రులు తెచ్చిన సంబంధం చేసుకుని తాను ఎంత సుఖపడలేదు. పెళ్ళి చూపుల నాడు తలెత్తిందా తాను. అసలు నోరు మెదప గలిగిందా? ఐనా తనకేం తక్కువైందని బంగారం లాంటి భర్త దొరకలేదా? అన్యోన్యంగా దాంపత్య జీవితం సాగిపోలేదా?

మొన్న పక్కింటి పద్మ కోసం పెళ్ళి చూపుల కొచ్చారని పిలిస్తే తను వెళ్ళింది. 'ఛ! ఎందుకు పోయానా భగవంతుడా' అనుకుంది. పిల్లవాడు పది మందిలో పట్టుకుని పది అడ్డదిడ్డమైన ప్రశ్న లేశాడు. వాడు సరే అడిగాడు. ఆ పద్మ మరో ఇరవై ప్రశ్న లెదురేసి జవాబు చెప్పాలా?

పేరేమిటి? ఏం చదువు కున్నారు? తల్లి దండ్రులు చెబితే అబద్ధ మనుకొన్నాడు కాబోలు. ఉద్యోగం చేయాలనుందా? ఏమో తాను మానుకుంటాడో లేక పీకేస్తున్నారో. వంట వచ్చా అని అడగలేదు. ఎలాగూ తానే చేసుకుంటానని నమ్మకం. ఛ! మరోసారి తిట్టుకుంది మనసులో.

పద్మ పెళ్ళి చూపులు తన కూతురు లీల చూడనందుకు సంతోషించింది తన కూతురి పెళ్ళి చూపులు, పెళ్ళి తన ఇష్ట ప్రకారం చేయించాలనుకుంది.

లీల కాలేజీనుండి ఈవేళ ఇంకా రాలేదు, కాస్త పెందరాళే రమ్మంది. లీలను పెళ్ళి చూపులకు తయారు చేయాలి. ప్రొద్దుటే కాస్త తీపి, ఖారం చేసి పెట్టింది. పెళ్ళి కుమారుడు ఇంజనియర్‌గా ఈ వూళ్లోనే పనిచేస్తున్నాడు. మర్యాదస్తుల కుటుంబం. కాని తల్లి తండ్రులే లేరు. అయినా ఫరవా లేదు. అతని పెద్దన్నయ్య బాధ్యత తీసుకున్నాడు.

ఇది వరకే రెండు సంబంధాల్ని లీల మొండిగా నిరాకరిస్తే వసుంధరమ్మ బాధ పడినా ఏంచేయలేక పోయింది. లీల పెళ్ళిచేస్తే తన బాధ్యత తీరిపోతుంది. మొగుడిక్కలేని తాను, ఎదిగిన ఆడపిల్లకు ఎంత త్వరగా పెళ్ళిచేస్తే అంత మంచిది. అందువా కాలం కూడా సరిగా లేదు. లీల యం. ఏ. పూరయిం తర్వాత చేసుకుంటానని మొత్తుకున్నా ఈ సంబంధం మంచిదని ఒప్పించింది. తన కోసం తల్లి పడుతున్న బాధను గ్రహించి అడ్డుచెప్ప లేకపోయింది.

తండ్రి గతించిన తరువాత పల్లెలో ఉన్న భూమిని అమ్మి తన పెళ్ళికిగాను కొంతడబ్బు బేంకిలో వేసింది. ఇప్పుడున్న చిన్నపాటి ఇల్లు, కొంతడబ్బుతో కాలం గడపాలని వసుంధరమ్మ నిశ్చయించుకుంది.



## పెళ్ళి చూపులు

తన పెళ్ళికై తల్లి అంతగా కలవరపడటం లీలకి సుతారం ఇష్టం లేదు. తన పెళ్ళిని ఒక సమస్యగా సృష్టించడం ఇంకా బాధ కలిగించింది. ఐనా తల్లి సహేతుకంగా చెప్పే కారణాల్లో కొంత నిజం లేకపోలేదనుకుంది. తాను మగవాడై పుట్టనందుకు చింతించింది. తనకో అన్నో, తమ్ముడో ఉన్నా తల్లిని ఒంటరిగా విడిచి పోకపోదును గదా అని అనుకుంది. స్త్రీ, పురుషులకు హక్కులొకటే ఐనా కొన్ని ఆచారాలకు తలవంచాల్సి ఉంటుందని నవ్వుకుంది బలహీనంగా.

సాయంత్రమైంది.

పెళ్ళివారొచ్చారు. మాటాడుతూనే ఫలహారాలు ముగించారు వాళ్ళు. కాఫీలు అందించింది లీల. కట్నం లేకున్నా పెళ్ళికాస్త ఘనంగా జరిపిస్తే చాలన్నారు.

వసుంధరమ్మకు వరసకు అన్న అయిన నారాయణగారు అన్ని విషయాలు మాట్లాడాడు. పెళ్ళికుమారుడు కుమార్ కి లీల చాల నచ్చింది. అందుకే ఆమెతో మాట్లాడాలని తన వదినతో చెప్పాడు. అందుకు ఆమె ఏర్పాటు చేసింది. సుందరమ్మకు సుతారం అది నచ్చలేదు. వద్దని అనలేక అయిష్టంగానే ఒప్పుకుంది.

"నేను కూడ కొన్ని విషయాలు మాట్లాడాలి. ఆ గదిలో మాటాడుకుందాం" అంటూ ప్రక్కనున్న గదిలోకి దారితీసింది లీల.

సుందరమ్మ చకితురాలైంది. కోపంతో ఉడికిపోయింది. తన బిడ్డ ఇలా చేస్తుందని ఆమె కలలో కూడ ఊహించలేదు. నారాయణగారు కుమార్ అన్నయ్యతో మాట్లాడుతున్నాడు. పని ఉన్నట్లుగా గబగబా పెరట్లోకి నడిచింది సుందరమ్మ ఎర్రబారిన ముఖంతో.

"మీకు యం.ఏ పూర్తి చేయాలనుందా?"

"అవును."

"ప్రమోషన్ వస్తుంది. ఈవూరు మారాలి. చదువు..."

లీల బిత్తరపోయింది.

మళ్ళీ అతనే అన్నాడు. "అప్పే తప్పనిసరి కాదులెండి. ఇవ్వాళ కాకున్నా రేపయినా దొరుకుతుంది ప్రమోషన్. మీరిక్కడే చదువొచ్చు. ఐనా ముందు అడిగి తెలుసుకోవడం బాగుంటుంది కదా!" ఒక్క క్షణం ఆగి "ఇంతకు మీకు నచ్చాననంటారా?" ఆశగా చూస్తూ అన్నాడు.

# పెళ్ళి చూపులు

లీల కాసేపు ఆగి 'ముందుఒకటడుగుతాను'

"అడగండి-తదుపరి భేధాభిప్రాయాలకన్న ముందే తెలుసుకోవడం ఇరువురికి శ్రేయస్కరం !"

"నా పెళ్ళి జరిగిన తదుపరి అమ్మ ఒంటరిగా ఈ ఇంట్లో ఉంటుంది. చిన్నతనం నుండి పెంచి పెద్దచేస్తే, ఆమెకు వయసు మీద పడేసరికి నేను విడిచిరావడం భావ్యమా? ఆడదై పుట్టడం వల్ల మనుషుల్ని కూడా త్రెంచుకోవాలా ? న్యాయంగా నేను మీ ఇంటికే రావాలి, నిజమే. కాని పరిస్థితి అర్థం చేసుకోండి. మీరే మా ఇంటికి వచ్చి దూరమైన మాతృప్రేమను ఎందుకు పొందకూడదు ? ఇది ఇల్లరికం అనుకోకండి. పెళ్ళయింతరువాత ఎలాగూ మీ అన్నయ్య ఇంట్లో కాకుండా వేరే కాపురం పెట్టాల్సిందే వేరే కిరాయి ఇంట్లో ఉండటమెందుకు? అమ్మ నన్ను మీచేతుల్లో పెట్టి బ్రతుకగలదు — కాని అమ్మను ఒంటరిగా చేసి ఎలా ఆనందంగా ఉండగలను. మానవత్వంతో యోచించండి. ఈ త్యాగాన్ని చేయగలరా మీరు?"

అతను తీవ్రంగా ఆలోచించసాగాడు.

"మరే... మీ తల్లి ఇలాంటి పరిస్థితిలో ఉంటే..... ఆమె మాటలు పూర్తికాలేదు."

'నిజమే. ఒప్పుకుంటున్నాను. కానిలోకం..' వీళ్ళు నమిలాడు.

"లోకం ఒప్పుకోమంటే ఒప్పుకుంటారా?" వెంటనే ప్రశ్నించింది లీల.

కుమార్ తృళ్ళిపడ్డాడు. "నేను మన స్ఫూర్తిగా ఒప్పుకుంటున్నాను. ఇంతకూ. మీకు నేను నచ్చినట్లేనా ?" కొంటెగా చూసాడు కుమార్.

లీల తలను పైకెత్తి కళ్ళల్లోకి చూసాడు. ఆకళ్ళు సిగ్గుతో వాలిపోయాయి.

పెరట్లో గది ప్రక్కన నిలబడి సంభాషణంతా విన్న సుంధరమ్మ కళ్ళలో ఆనంద భాష్పాలు రాలాయి. తన పెళ్ళయిన తరువాత తన ఒంటితల్లిని పక్కింటివాళ్ళకు, బంధువులకు అప్పగించి అబలగా ఏడుస్తూ వచ్చింది. తన ఏడుపు చూసి తల్లి ,అంటె ఎంతప్రేమ ! అనుకున్నారు. తనప్రేమకన్న తనబిడ్డప్రేమే గొప్పది. ఎంత ముందుచూపు! ఎంత సాహసం ! ఈనాటి పెళ్ళిచూపులు మంచివే, ఈ కాలం కూడ మంచిదే నంతోషంతో అనుకుంది వసుంధరమ్మ.

# హైదరాబాద్ నోట్‌బుక్ —తిరుమల రామచంద్ర

### సోమశేఖర సంస్మరణం

"మా సోమశేఖరశర్మ బంగారుకంచం, దానిని నిలపడానికి గోడలేదు. 'డిగ్రీలులేని పాండిత్యం. వన్నెకు రాని కాలాన పుట్టాడు" అని వాపోయారు శ్రీ విశ్వనాథసత్యనారాయణ సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రతిభకు తగిన ఆదరణ లేక పోవడంచూచి; కాని ఏ ప్రజా సేవకుడూ తనకు ఆదరం జరుగుతుందనే అభిలాషతో పనిచేయడు. తనకర్తవ్య దృష్టితో బాధ్యతాభావంతో పనిచేస్తాడు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ అలాటి దృష్టికి, అలాటి భావానికి పరాకాష్ఠ. జనవరి రెండవ వారంలో రాష్ట్ర పురాతత్త్వశాఖ శ్రీ సోమశేఖర శర్మగారిని సంస్మరించి ఇప్పటితరంవారికి కనువిప్పు కలిగించింది. సోమశేఖరశర్మ స్మారక సంచికను - జాతీయ పురావస్తు ప్రదర్శనశాఖ మాజీ డైరెక్టర్ శ్రీ కంచిశివరామమూర్తి ఆవిష్కరించి, రెండు రోజులపాటు స్మారక ప్రసంగాలు చేశారు. శ్రీ శివరామమూర్తి శ్రీ శర్మగారికి సుపరిచితులు, సన్నిహితులు. ఆయన తొలిసారిగా స్మారకోపన్యాసాలివ్వడాన్ని ఏర్పాటు చేసిన పురాతత్త్వ శాఖను ప్రశంసించకతప్పదు.

ప్రారంభోత్సవం జరిపిన మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, అధ్యక్షత వహించిన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి, నాగార్జున విశ్వవిద్యాలయం చరిత్రాచార్యులు డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం మున్నగువారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ చరిత్రకు చేసిన సేవను వివరించారు.

### కుమారి జి. లలితా పీటర్స్

తెలి మనసును, చల్లని ఉల్లాన్ని తేటతెల్లం చేసే తెల్లని నవ్వుల మధ్య.

వాచా మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమోభవత్,
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగను శాసనం—

ప్రార్థిస్తారు. కుమారి లలితా పీటర్స్. వ్యాకరణమంటే చాలామందికి తలనొప్పి, మరి కొందరికి వట్టిపిప్పి. కాని ఆమెకు మాధుర్యం ఉప్పతిల్లేతిప్పి. కనుకనే ఆమె తెలుగు వ్యాకరణ సంప్రదాయ పరిశోధనలో నిమగ్నులయారు. ఏ విషయాన్నయినా కదళీపాకంగా బోధించేతీరు, ఎంతటి ఏడుపుగొట్టువారినయినా కడుపుబ్బ నవ్వించేసేరు, ఆమె పరిశోధనకు మరి రెండు తురాయిలు. కనుకనే ఆమెను విద్యార్థినులు జీవితంలో మరువరు. ఆమె వ్యాకరణ పరిశోధనలో ఎందరో కొత్త వైయాకరణలు వెలుగు చూస్తారు. ఎన్నో అపూర్వ వ్యాఖ్యలు, మూలగ్రంథాలు చిరకాలపు అంధకారవాసం నుంచి ఆవులిస్తూ వస్తాయి. ఆమె ఎన్నో మూలబడిన ఏకదేశి వ్యాకరణాలను—విభక్తిదీపిక, వైకృతదీపిక వంటివాటికి ఊపిరి పోస్తున్నారు. ఇంతెందుకు ? మొదటి వ్యాకరణ మన బడే ఆంధ్రశబ్ద చింతామణి మొదలు 20వ శతాబ్ది వ రొడవ పాదంలోని శ్రీ వంపవాం రామకృష్ణరావు ముక్తలక్షణ కౌముదివరకు తెలుగు వ్యాకరణాలన్నీ ఆమెకు కరతలామలకాలు. తాతగారు ఉద్యోగరీత్యా కేరళలో ఉన్నప్పుడు కేరళలో 1932లో జన్మించిన లలితాపీటర్స్‌కు చిన్ననాటి నుంచే తెలుగు తోబుట్టువులయిన తమిళ మలయాళ భాషలతో కలిగిన పరిచయం, నేడు వ్యాకరణ పరిశోధనకు తోడ్పడింది. గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూల్ క్రిస్టియన్ ఉమెన్స్ కాలేజి, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో విద్యాభ్యాసంచేసి 1953 లో ఎం. ఏ. అయి, వెంటనే ఏలూరులోని సెయింట్ థెరెస్సా కళాశాలలో నాలుగేళ్లపాటు పనిచేసి, తర్వాత అప్పటి నుంచి రాణీ మేరీ కల్నూరి [క్వీన్‌మేరీస్ కాలేజి]లో తెలుగుశాఖలో పనిచేస్తూ, ప్రస్తుతం ఆ శాఖకు అధ్యక్షగా ఉన్నారు. కుమారి లలితా పీటర్స్ కేవలం పరిశోధన పరాయణురాలేకాక, సర్జనశీల సాహిత్యాన్ని సృష్టించారు. ఆంగ్ల తమిళాల నుంచి ఎన్నో అనువదించారు. ఎన్నో కథలు, వ్యాసాలు వ్రాశారు. కొండ లోయల్లో నీటిబుడగలు, దైనిక ప్రార్థనలు, దాసుని మార్గం, సిలువధ్యానం, యథార్థ జీవితం వంటివి కొన్ని అనువాదాలు. దేవుడే ఆశ్రయం, క్షమాపణ అనేవి మౌలిక నవలలు. ఆమె కథలు సమకాలిక పత్రికలు ప్రగతి, మహిళా, కామధేను, ఆంధ్రప్రభలలో ప్రచురితాలు. ఆమె క్రీస్తు సర్వోత్తమత్వం నమ్మిన భక్తురాలు. విద్యార్థిని దశ నుంచి ఆమెను చూచినవాకే గుప్తంగా ఆమె సాధించిన ప్రగతి ఎంతో ఆశ్చర్యం కలిగించింది. సాహిత్య వ్యాసంగం తప్ప ఆమెకు మరొక వ్యాసంగంలేదు.

### గవర్నర్ భండారే హితవు

గవర్నర్ శ్రీ భండారే జనవరి 12వ తేదీన డబీర్‌పురాలో హరిజనసహకార ప్రచురణ ముద్రణాలయాన్ని ప్రారంభిస్తూ చేసిన హితవును బలహీన వర్గాలవారు శ్రద్ధగా పాటించాలి. ఏ జాతి అయినా న్యూనతాభావం ఉన్నంతవరకుముందుబడదు. బలహీన వర్గాలవారు తమ న్యూనతాభావాన్ని విడనాడడమేకాక, ఇతరుల సానుభూతికోరే మనస్తత్వాన్ని వదలుకోవాలి. రాజ్యాంగంవారికి ఎన్నో సౌకర్యాలుకలిగించింది. వాటిని సక్రమంగా ఆచరణలో పెట్టడానికి ప్రయత్నాలు చేస్తే చాలు. వారికివెవరి దయా దాక్షిణ్యాలు అక్కరలేదు.

### ఉపశ్రుతి :

"పేర్ల మార్పులో మనవారికున్న మోజు చూస్తే అసహ్యమేస్తుందోయ్ !" అన్నాడు ఇటీవల మద్రాసుకు వెళ్లివచ్చిన ఒక మిత్రుడు. 'ఏ ?" అన్నాను. "వంద సంవత్సరాలకు పైగా ఉన్న హామిల్టన్ బ్రిడ్జి పేరు అంబేద్కర్ బ్రిడ్జి అని మార్చారు." అన్నాడు. "దానికెందుకు కష్టపడతావోయ్. ఇదంతా మనకున్న న్యూనతాభావం వెర్రితలలు. పేర్లు మార్చినంత మాత్రాన చరిత్ర మర్చగవుతుందా ? మనం మాత్రం కింగ్స్‌వేను రాష్ట్రపతిరోడ్డుగా మార్చలా ? పాతపేర్లు పాత ఊళ్లు ఉండడం మన ఔదార్యానికి చిహ్నం. కొత్తవాటికి మనం ఇష్టం వచ్చిన పేరు పెట్టుకోవచ్చు. అన్నాను ఓదార్పుగా.



పనివేళల్లో బాతాఖానీ మనకి దేశానికి నష్టం



# ఫాలాకుని డైరీ

(15వ పేజీ తరువాయి)

## ప్రతి స్త్రీకి ఓ ఉంగరం !

ఇజ్రేలు సిబ్బందిలో స్త్రీలు అధికంగా వుండడం వల్ల, వీరు ఎన్ని నగలు పెట్టుకోవచ్చు అనే విషయం మీద సైనికాధికారులు విచారించి, ప్రతి స్త్రీ కేవలం ఒక వుంగరం మాత్రం పెట్టుకోవచ్చనీ, చెవులకు కూడా నగలెట్టుకోరాదనీ తీర్మానించి, చట్టం చేశారట. చెవులుండచ్చన్నారుకదా! పోన్లెండి. సమ్థింగ్‌బెటర్ !

## బ్యాంకు దోపిడీ అరికట్టే యంత్రం !

అమెరికాలో బ్యాంకు దోపిడీదారులను అరికట్టలేక ఓ కొత్తరకం యంత్రాన్ని కనిపెట్టారుట ఇది చూడ్డానికి బ్యాంకు డబ్బు కట్టలుగా కనుపిస్తుందట. ముట్టుకోంగానే బోలెడు పొగవచ్చేస్తుందట. అంతేగాక చెవులు చిల్లుపడేలా శబ్దం చేస్తుందట. మరి క్యాషియరు ముట్టుకుంటే !

## తారుమారయిన అంచనాలు !

కలకత్తాలో సొరంగ రైలు మార్గం వేయడానికి సుమారు 140 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేశారట. తీరా పని మొదలెట్టాక అది రెండొందలరవై కోట్ల వరకూ అంచనా పెరిగిందట. అసలది పూర్తయ్యేసరికెంతవుతుందో ఆ రమారమణునికే ఎరిక! ఆయన మాత్రం చెప్ప గలడా !

## ఆపరేషన్ చేయించుకోకపోతే ఆరు నెలలు కఠిన శిక్ష !

మహారాష్ట్రంలో 'కుటుంబనియంత్రణ' పరిమితి దాటి పిల్లలు కనడానికి కుతూహలపడి ఆపరేషన్ చేయించుకోకుండా ఎగవేసేవారికి ఆరు నెలలు కఠిన శిక్షట. శిక్ష పడగానే ఆపరేషనుకు ఒప్పుకుంటే విడుదలట. మరి శిక్ష అనుభవించి ఆపరేషను చేయించుకోకుండా వచ్చేస్తేనో!

## అద్దె గదికి రోజుకి రెండున్నరవేల డాలర్లా !

అమెరికాలో హూస్టన్ నగరంలో ఆస్ట్రోబిర్లట్ అనే హోటల్లోని గదికి రోజుకు రెండు వేలయిదు వందల డాలర్లు అద్దెట. ప్రపంచంలో ఇరవై నాలుగ్గంటల కింతద్దె గల హోటలు లేనేలేదట.

## ఎత్తుకుపోవడం నెత్తురుకోసం !

ఎత్తుకుపోడంలో గాని, దొంగతనం చేయడంలోగాని ఏదో ఒక దానికాశపడి మాత్రమే జరుగుతాయవి. ఓ స్త్రీని ఎత్తుకు పోయారంటే ఎందుకో అనుకుని, అందుకా అనుకుంటాము. కానీ యిటీవల కొందరు మన దేశంలో ఒక చోట ఓ 40 ఏళ్ళ ఆవిడను ఎత్తుకు పోయి, ఓ 400 సి.సి. ల రక్తం తీసుకుని పంపేశారట. ●

# * అవీ - ఇవీ - అన్నీ *

## మరో వసంతం

శ్రీమతి వాడపల్లి అనసూయాదేవి రచించిన 114 పేజీలున్న ఈ సాంఘిక నవల వెల రు. 4.00 లు ప్రతులకు: దత్తాత్రేయ ప్రెస్, సంజీవరెడ్డి భవన్, ఖమ్మంకు వ్రాయవచ్చు.

## శ్రీమదాంధ్ర భగవద్గీత

పద్యకృతి: కృతికర్త: కార్యంపూడి రాజమన్నారు. పేజీలు 155. వెల రు. 4.50 పైసలు. ప్రతులకు: టి. శ్రీకంఠం, బి. ఎ. ఎల్.ఎల్.బి, అడ్వకేట్, బ్రాడీపేట, గుంటూరు—2 లేక పి.రవీంద్రరావు హైదరాబాద్ సన్ ప్రెస్, 1—1—261/8, చిక్కడపల్లి, హైదరాబాద్—20 కి వ్రాయవచ్చు.

## నానా ఫడ్నీస్

క్రీ. శ. 18 వ శతాబ్దికిచెందిన మహారాష్ట్ర వీరుడు నానా ఫడ్నీస్ జీవిత చరిత్ర గ్రంథం మా కార్యాలయం చేరింది. రచయిత శ్రీ సిద్ధాంతిమల్లి ఖార్జునం. పేజీలు: 180 వెల రు. 10 లు. దీని ప్రచురణ : రాధామాధవి ప్రచురణలు 497 కస్తూరిదేవినగర్, నెల్లూరు.

## ఈశ్వరుడు — కర్మఫలం

(పూర్వజన్మ పరజన్మ) తెలుగు సేత: శ్రీ పుల్లాపంతుల 'శ్రీ చిత్' 46 పేజీలు, వెల:2 రూపాయలు. ప్రతులకు పుల్లాపంతుల కమల, కేరాఫ్ పుల్లాపంతుల 'శ్రీచిత్'నారాయణపేట, అమలాపురం

## రత్నత్రయి

ద్వితీయ భాగం. తిరుప్పావై సంస్కృతి వ్యాఖ్య వ్యాఖ్యాత: శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు. 268 పేజీలు. వెల 12 రూపాయలు ప్రకాశకులు: శ్రీ గోర్లా గంధమాల. ముసునూరు కృష్ణా. జిల్లా.

# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

## సినిమా

ఆగాచార్య గీసిన 'ముంగిట సంక్రాంతి ముగ్గు' అను ముఖ చిత్రంతో వెలువడిన సంక్రాంతి సంచిక ఎప్పటివలె ప్రత్యేక శీర్షికలు తీసుక రాకపోయిన చాల ఆకర్షణీయంగా యుంది. కథలలో 'సృష్టి' పద్మావతీవిలాస్, బాగున్నాయి. సినిమా శీర్షికలో జయసుధ ప్రేక్షకులకు కృతజ్ఞతలు తెలుపుకొంది సరే. కాని ఆమెను అభిమానించే వారిలో విద్యాధికులు, ఉన్నత పదవులు నిర్వహించే వారే గాక సామాన్య ప్రేక్షకులు కూడ ఉన్నారన్నది మరిచి ఆమెను అభిమానించే వారు విద్యాధికులు, ఉన్నత పదవుల నిర్వహించే వారు కాబట్టి ఆనందిస్తాను అని సామాన్య ప్రేక్షకులను నిరుత్సాహపరచింది. ఆ పత్రికలోనే రామలక్ష్మి గారన్నట్లు చదువురాని వారు సంస్కార హీనులు కారు. అదీగాక తెలుగు సినిమాలు ఎక్కువ శాతం సామాన్య ప్రేక్షకుల పైనే ఆధారపడి ఉంటాయి. అని తెలుసుకుని అందరిని సమ దృష్టి తో ఆదరించినపుడే ఆమె ప్రేక్షకుల హృదయాల్లో మంచి స్థానం ఏర్పర్చుకోగలుగుతుంది.

మహ్మద్. రహీముల్లా, అర్జునపట్ల, [చేర్యాల

స్వప్నసుందరి రీనారాయ్ ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో 1976 చిత్రాలు, వాటి దర్శకుల పేర్లు, సంగీత దర్శకుల పేర్లు తెలియ చేసినారు. 'వేములవాడభీమకవి' చిత్రానికి ఎన్.టి. ఆర్. దర్శకులు కాదు. దానికి డి. యోగానంద్ గారు దర్శకులు. అట్లే సంగీత దర్శకులు రాజేశ్వరరావు కాదు, పెండ్యాలగారు.

ఎస్. ఏ. రహమాన్, కదిరి ]

* * *

1976 లో విడుదలయిన చిత్రాలు అనే శీర్షికలో సినిమాలు జాబితా, దర్శకుల, సంగీత దర్శకుల పేర్లలో వేములవాడ భీమకవి చిత్రానికి ఎన్. టి. రామారావుగారు దర్శకత్వం వహించారని ముగ్గురు మూర్ఖులు చిత్రానికి మహేష్‌గారు దర్శకత్వం వహించారని వుంది అది తప్పు. వేములవాడ భీమకవి చిత్రానికి డి. యోగానంద్‌గారు, ముగ్గురు మూర్ఖులు చిత్రానికి కె. హేమాంబరధరరావుగారు దర్శకత్వం వహించారు.

కె. ఎస్. ఎం. [వరంగల్]

## సీరియల్

21.1.77 వ ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం హిందీనటి రీనారాయ్ చిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది. సీరియల్స్ 'నగ దిక్కు', 'ఓ తార కథ' మంచి సరళ శైలిలో నడుస్తున్నాయి. రామలక్ష్మిగారి జవాబులు చాలా బాగున్నాయి. మరో క్రొత్త సీరియల్ 'ఇన్ క్రెడిబుల్ గాడెస్' వంటి కథలు అందించిన మీ పత్రికకు మా ధన్యవాదములు. కథలు 'నడుమ కోరిక', 'తాజమహల్', 'సారీ', 'సగటు రచయిత' కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా ఈ పత్రికలో సినిమా వార్తలు చాలా బాగున్నాయి.

రవీంద్రభారతి. [అనంతపురం]

# ఉత్తరాలు

## కథలు

ఈ సారి సుమారు అన్నీ అత్యుత్తమమైన కథలు ప్రచురించినందుకు సంపాదక వర్గాన్ని అభినందిస్తున్నాము. ఇందులో ముఖ్యంగా విజయ్‌గారి కుంచించిన 'తాజమహల్ కోసం' ఓ ఎంతో మధురమైన కథ. శారద లాంటి చంచల మనస్కురాలైన స్త్రీలకు ఇది కనువిప్పు. త్యాగం చేయటంలో పురుషునిదే పైచేయని మరోమారు రుజువయింది. కిరీటి పాత్ర చిత్రీకరణ అత్యద్భుతం. 'ప్రేమ'కు అర్థం తెలియని స్త్రీలు నేర్చుకునేది చాలావుందేమోనని పించింది కథ. విజయ్‌గారికి ధన్యవాదాలు 'పడుచుకోరిక' కథ పడుచు జంటలకి సంతోషాన్ని కలుగజేస్తాయి. ఈ కథ చదివి నవ్వుకున్నాము.

పద్మాకర్, యశోద [అనంతపురం]

* * *

7.1.77 ఆంధ్రపత్రికలోని 'కలకాలం నిలిచే ఒక ప్రేమకథ'లో అందాన్ని అసరాగా చేసుకుని దీపం పురుగువలె తన చుట్టు తాను ఒక పురుషున్ని త్రిప్పుకొని చివరికి మోసం చేసిన 'రత్న' మూర్ఖురాలే అవుతుంది 'నాకొక బావవున్నాడు అతన్నే పెళ్ళాడతానని' చెప్పి వుంటే యింత రాద్ధాంతం జరిగివుండేది కాదు. మళ్ళీ ఐదేళ్ళ తర్వాత ఉత్తరం వ్రాసిన 'రత్న' సారథిని ఎత్తి పొడిచిందే కాని కలకాలం నిలచిన ప్రేమ వల్ల కాదని నా అభిప్రాయం?

అబ్దుల్ సలామ్, [ఆల్వాన్‌పల్లి]

* * *

అందాలతార జయసుధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'కిన్నెర' కథ చాలా గంభీరంగాను, హాస్యంగాను నడిచింది. 'పాకెట్ మార్' పాత్ర కలకాలం మా మనసులో నిలిచిపోతుంది రచయిత శ్రీ దేశెట్టి కేశవరావుగారికి నా అభినందనలు. ప్రతివారంలాగా కాకుండా ఈ వారం ఎక్కువ కార్టూన్స్‌తో పత్రిక మమ్మిలను కడుపుబ్బ నవ్వించింది. 'ఓ తార కథ' సీరియల్ చాలా బాగుంది.

పి. వి. రామనాథరావు [నేలకొండపల్లి]

* * *

21.1.1977 వారం పి. వి. ఆర్. శివకుమార్ గారి పడుచుకోరిక, విజయ్‌గారి రచనలో వెలువడిన తాజమహల్ కోసం కథలు చాలా బాగున్నాయి. తాజమహల్ కోసంలో కిరీటి పాత్రను రచయిత చాలా బాగా సృష్టించారు. సీరియల్ ఓ తార కథలో మాలతి క్యారక్టరు బాగుంది.

ఈ వారం సినిమా విశేషాలు బాగున్నాయి. ప్రేమలేఖలలో దీప—సుధల స్టిల్స్, 30 వ పేజిలోని ఈ తరం మనిషిలోని శోభన్, జయల మరియు ప్రేమించి పెళ్ళి చేసుకో స్టిల్స్, ఈ శీర్షికకు ఎంతో శోభనిచ్చాయి.

ఎం. ఆర్. కె. రావు, [తిరువూరు]


Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada 2. Editor: S. Radhakrishna

# బ్రూ: ప్రత్యేక రుచి, సరియైన చిక్కదనం




మంచి కాఫీ అభిమాను
లందరికి:

బ్రూ ప్రత్యేక రుచి దేశమంతటా కాఫీ అభిమనుల మెప్పును పొందింది అందువలన ఇన్‌స్టెంట్ కాఫీలో మేటిగా ఉన్నది. బ్రూ రుచి మీద అభిమానం రోజురోజుకూ పెరుగుతోంది. మంచి చిక్కని కాఫీ బ్రూ ఎప్పుడూ అసమాన తృప్తినిస్తుంది మెచ్చిన రుచి. చిక్కదనం ఈ రోజే వాడి చూడండి.

## దక్షిణాదిన మేటి అయిన బ్రూ అతిత్వరగా భారతదేశపు అబిమాన ఇన్‌స్టెంట్ అవుతుంది

OBM-4766A/2 TEL

Regd. No. H/VJ 41 ANDHRA SACHITRA VARA PATRIKA

